# సత్యం

## ఒకటో రంగం

[విజయరామరాజు బుస్సీ సహాయంతో, బొబ్బిలివారి నందరినీ చంపి, కోట నాక్రమించుకున్నాడు. బొబ్బిలిని నాశనం చేస్తానని పట్టుపట్టి, వొక్కమనిషికూడా బయట పోనీయకుండా కట్టుదిట్టం చేశాడు. కాని ఫ్రెంచివాళ్లు అతనికి తెలీకుండా లంచాలు తీసుకొని, లంచమిచ్చిన వాళ్ళని బయటికి వొదిలేస్తున్నారు. యీ తప్పించుకున్నవాళ్ళకి బళ్లు దొరకడములేదు, కొందరు వొక బండిని దొరికించుకున్నారు.

మధ్యాహ్నం రెండు గంటలు. పెద్ద రెండెడ్లబండి, రాజాం రోడ్డుమీద పోతోంది. బండినిండా మనుషులు కూచునివున్నారు. 1. బండీవాడూ, 2. వాడి పక్కన సత్యం, చాలాఅందంగా వుంది. ఆ నగలూ, కట్టూ, బొట్టు భోగందనితెలియచేస్తున్నాయి. బండిలో తక్కినవాళ్ళందరూ ఆమెకి తలగలకుండా కూచున్నారు. ఆమెపక్కన కూచోడానికి యెవరూ వొప్పుకోరు. 3. ఆమె విటుడు, సూర్యప్రకాశంగారు. ఆమెకి కొంచెం దూరంగా కూచున్నారు. ఆయన షోకీ పురుషుడు. ఆయన్నిచూడ్డంతోటే యింట్లోకంటె భోగంవీధుల్లోయెక్కువ జీవితకాలంగడుపుతాడని తెలుస్తోంది. 4. అమృతంగారు. పొట్టి. పీల మొగమనిషి. కీచుగొంతుక. భార్యని చూస్తే కొంచెం భయం. 5. ఆయనభార్య కనకమ్మ. గొప్ప పతివ్రత. కులస్త్రీ. పసుపు, కుంకుమ, నల్లపూసలు, మట్టెలు వీటన్నిటితోనూ, ఆమె పతివ్రతాతనాన్ని చాటుతోంది. 6. మాధవుడు. కనకమ్మ కుమారుడు. 7. సచ్చిదానందస్వాములవారు. సన్యాసి వేషంఅరవై యేళ్లు. 8. దుర్గమ్మగారు. తలగొరిగిన విధవ, ముప్పై అయిదేళ్లు. మాధవుడు కనకమ్మ నానుకొని నిద్రపోతున్నాడు. దుర్గమ్మ కునికిపాట్లు పడుతోంది.]

---

* దీనికి మొపాసా కథ కొంతవరకు ఆధారం

సూర్య: (సత్యంతో) సరే, పోనీ మనం పోతుంది. లోపలికి వస్తావుటే?

సత్యం: చోటేదీ?

సూర్య: నేను నీచోట కూచుంటా లేవే.

సత్యం: మీ కెందుకటూ?

సూర్య: నాకేం మొగాణ్ణి. నీ కొత్తాని మొహం కందుతుందే.

సత్యం: (సిగ్గుతో) పరవాలేదు లెండి.

సూర్య: అట్లా కాదే.....

కన: ఇక్కడ మెదలడానికి చోటు లేదు, ఉక్కిరిబిక్కిరవుతూంటే.

సూర్య: (సత్యంతో) మొన్నటిదాకా ఇల్లాంటి ప్రయాణాలు వెడుతున్నావుటే? లోపలికి రావే!

కన: (అమృతంతో) చెప్పండి.

అమృ: (సూర్యప్రకాశంతో) అట్లానే వుంటుందా! ఇప్పుడు కదలడ మెందుకు?

సచ్చి: జయ్ శీతారామ్. జయ్ శీతారామ్.

సూర్య: (సత్యంతో) వాళ్ళమాటల కేం లేవే, నువ్వు లోపలికి వొచ్చేటట్టయితే, రావే.

కన: అడ్డమైనవాళ్ళతోటీ, బండి యెక్కిందికాకుండా, వాళ్ళని ఇంకా నెత్తిమీదకూడా కూచోపెట్టుకోవాలిట! ఛీ, ఛీ.

సూర్య: అడ్డమయినవాళ్ళకీవున్న బుద్ధీ, అందం మన కుంటే యింకేం?

కన: (అమృతంతో) చూడండి, ఆమాట. భోగం కొంపలుపట్టుకు తిరిగే.....

సచ్చిదా: జయ్ శీతారామ్.

సూర్య: దొంగతనంగా, ఎవరికీ తెలియకుండా, మర్యాద గల యింట్లో.....

కస: (అప్పశాస్త్రితో) మాట్లాడరేమండీ!

అప్ప: (సూర్యప్రకాశంతో) యిట్లాటి మాటలంటే...

సచ్చిదా: (బిగ్గరిగా) జయ్ శీతారామ్.

మూర్తి: (ఉలికిపడి లేచి) యెన్ని మైళ్లొచ్చాము?

[స్టైలు సరిచేసుకొని. గుండు మీద ముసుకు సరిగా తీసి, రుద్రాక్షల తావళం తిప్పుతోంది]

సచ్చిదా: పదిహేను మైళ్ళు దాటాము.

కస: యింక పరవాలే దనుకుంటా.

సచ్చి: గోవిందా! ఈశ్వరకటాక్ష మెట్లావుందో? మన చేతుల్లో యేముంది. జయ్ శీతారామ్.

సత్యం: రాజ్యమంతా తురకలు ఆక్రమించుకున్నారట.

[యెవరూ బదులు మాట్లాడరు. మొహాలు తిప్పేశారు]

దుర్గ: (ప్రకాశంసూర్యగారూ, మీరెంత యిచ్చారండీ?

సూర్య: అయిదు వేలు.

దుర్గ: మీ భార్యా పిల్లలూ యేరి?

సూర్య: యేం చెయ్యను? వున్నవే నాలుగు వేలు. అవీ, దాని నగ లమ్మితే వొచ్చాయి. యింకా అయిదువే లిమ్మన్నారు, వాళ్ళకికూడా అయితే......

దుర్గ: అయితే......

సూర్య: యెక్కణ్ణించి తీసికొచ్చేది?

దుర్గ: మీకు పెద్దఆస్తి వుండాలిగా!

సూర్య: (సత్యాన్ని చూసి) ఇట్లాంటి స్నేహితులకి పంచి పెట్టాను.

మర్ని: అయ్యో! ఎంత తెలివి తక్కువండీ! మీకు విచారంగా లేదూ?

సూర్య: దేనికి విచారం? తక్కినవాళ్లు పడాలి విచారం. అనుభవించకుండా దాచుకున్న వాళ్ళపని యిప్పుడేమయింది? నాకేమి, మహారాజులాగ అనుభవించాను.

కన: అయినా, భోగం ముండలు, వున్నట్టైవుండి, కొంపలు ముంచుస్తారు. వాళ్ళని నమ్మిన వాళ్ళంతటి బుద్ధితక్కువ...

సూర్య: పొడుడు నక్కలమల్లే వుండే ఈ కులస్త్రీలను నమ్మి ప్రయోజనమేమిటి? జోగీ జోగీ రాసుకుంటే...

సచ్చి: జయ్ శీతారామ్.

సత్యం: (సూర్యప్రకాశంతో) పెళ్లాం నగలమ్మి, లంచమిచ్చి, మీరు తప్పించుకొచ్చారా?

సూర్య: మరి నువ్వు వొచ్చేస్తోవుంటే నే నింక ఆవూళ్లో చేసే దేముందే? స్వాములవారంటివారే, భయపడి...

సచ్చి: జయ్ శీతారాం!

కన: వాటూ రెండు వేలిచ్చారు.

అమ్మ: ఏమండీ, స్వాములవారూ; మేమంతా సరే. తమరు అన్నీ వొదులుకొని సర్వసంగపరిత్యాగం చేశారే...

సచ్చి: మాకేం? యెక్కడున్నా వొకటే. డబ్బుతో మాకు తక్కేమిటి? బంగారమూ తృణం సమానము. కనక నే వున్నదేమిటో వాళ్ళ మొహాన పారేశాం, యేడుస్తావుంటే. డబ్బు క్షుద్రికల వాళ్లదగ్గిరే వుణ్ణీ ఆడబ్బు.

అమ్మ: అవును. డబ్బు శాశ్వతమా! వుండవలసింది దేశ భక్తి, ఆమహాపురుషులు రంగరాయలూ, వెంగళరాయలూ, పాపయ్యా, పోయినతరువాత బొబ్బిలిమొహం చూడలేక పరుగెత్తుకొచ్చాను.

సత్యం: వున్నవాళ్ళ గతేమిటి?

[యెవరూ బదులు మాట్లాడరు. ఆమెవంక చూడరు.]

దుర్గ: నేను వొంటరిదాన్ని. యేమో ఆడదాన్ని. ఆ ఫరంగిసరదార్లు యేంచేస్తారో! మానంకంటె స్త్రీకి యెక్కువేమిటని, మాతమ్ముడు దాచుకున్న ఆరువేలూ నాదగ్గిరుంటే, అవిచ్చి తప్పించుకొన్నాను.

సూర్య: పోనీ. మానమంటే అంత అభిమానం గలవారు, మరి బొబ్బిలి ఆడవారు పేర్చినగుండంలో పడకపోయినారా?

దుర్గ: (కన్నీళ్లు పెట్టుకొంటూ) పడితే ఆయనతోనే ఆనాడే పడవలసింది. యిప్పు డెందుకు? పుణ్యమా, మోక్షమా!

సూర్య: యుద్ధానికి ముందు, బొబ్బిలి, బొబ్బిలి, బొబ్బిలికి ప్రాణాలిస్తామన్నారు. ఆ ప్రభువులు కాస్తా పోగానే యెవరి తోవ వారిది.

అమ్మ: తమరూ అంతేగా!

సూర్య: నాసంగతికూడా కలుపుకునే అన్నా.

కన: మాఅబ్బాయికోసం వొచ్చాగానినేను, లేకపోతే బొబ్బిలి కదిలేదాన్నా! యింక వంశనాశనమయితే...!

సూర్య: మరి రావువారి వంశం సంగతేమిటి? మనకోసం వారి వంశమంతా నాశనమయిందే! యిదే దేశభక్తి! వంశంలేని సన్యాసులుకూడా......

సచ్చి: జయ్ శ్రీరాం, ఏకమేవాద్వితీయం. అహం బ్రహ్మాస్మి! ఆత్మంతే స్వేచ్ఛఅయిన పదార్థం యింకోటిలేదు. మాఆత్మ నెవరికై ఐపుహ్యాగలరు? యీవిజయనగరంవాణ్ని! ఖయిదీలాగున్నా స్వేచ్ఛ నాకు. జయ్ శ్రీరాం.

సూర్య: (సత్యంతో) నువ్వేందుకొచ్చావే? నీకెక్కడున్నాయిబ్బం దేముందే?

సత్యం: యిందరికి కారణాలుండగాలేనిది, నాకుండవాదేమిటి? ఆ కారణాల్లో ఏదన్నా సరిపోతుంది.

మర్గ: అన్నీ కారణాలే! యింకోళ్ళ ప్రాణాల్తో వెలిగించడానికి! గతిలేక యీబండిలో యెక్కాము. యేం చేస్తేపోతుందో... యీపాపం! యేమండీ స్వాములవారూ, యేం చేస్తే పోతుందీపాపము? చివరికి విచారించినా...

సచ్చి: శరీరానికిగాని మైల, ఆత్మకేముంది? అందరి ఆత్మా వొకటే! ఐనా లోకోపకారార్థం, సన్యాసులుకూడా యీ భేదాలు పాటిస్తారు. తప్పనిసరైనప్పుడు పాటించరు. అయినా శరీరాన్నీ, ఆత్మనీ, డబ్బిచ్చినవాడిస్వాధీనముల్లా చేసే భోగందాన్ని నరకంలో......బొబ్బిలి ధ్వంస మయింది యిట్లాంటి పాపాత్ము లుండబట్టే!

సూర్య: (సత్యంతో) వాళ్ళతో మనకేంగాని, యెందుకొస్తున్నావు చెప్పు.

సత్యం: మాయింట్లో విజయనగరం సర్దారొకడు చేరి, నన్ను బలవంతం చెయ్యడం మొదలుపెట్టాడు. దేశద్రోహి, కిరాతుడు, వాణ్ణి, ముట్టుకోనిస్తానా! అవతార పురుషులు వెంగళరాయల పాదధూళిని నాతలమీంద వేసుకున్నా. ఆయన

మాధ: (రెండు నిమిషాలుండి) అమ్మా! అమ్మా! నేనుండ లేను. నా ప్రాణాలు పోతున్నాయి.

అమృ: పిల్లవాణ్ణి చంపుకుంటావా?

కన: అయితే ఆనీళ్లు తాగనిస్తారా? చస్తేనే మంచిది. దానినీళ్ళు తాగడంకంటె......

అమృ: (మాధవుడితో) యిట్లారా, నే నిప్పిస్తాను.

కన: వొల్లకాదు.

అమృ: ప్రాణం పోయ్యేటప్పుడా! నేనిప్పించి తీరతాను.

[బలవంతంగా కనకమ్మనునెట్టి అమృతం మాధవుణ్ణి తనవేపులాక్కుంటున్నాడు]

కన: నేను వురేసుకుంటా, బావిలో పడతా.

సూర్య: హాయిగా చల్లని నీళ్లు తాగొచ్చు.

కన: (సత్యంతో) నువ్విస్తావుటే? నీకు సిగ్గూ, మతం, యేమీ లేవుటే. నీ నీళ్లు బ్రాహ్మల కిచ్చావంటే, పురుగులు పడి పోతావు, జన్మ జన్మాలకి......

సచ్చి: జయ్ శీతారాం. నా కమండలంలో కొంచెంగా నీళ్లున్నాయి.

కన: (కోపంతో) యింత సేపెందు కూరుకున్నారండీ? మంచివారే!

సచ్చి: అవి యెంగిలయితే? మావంటివారు యిక్కడ కూచోడమే తప్పు. యీ బండిలో యెక్కడమున్నా! యీ లోపల నాకు దాహమయితే, మళ్ళీ యెక్కడ దొరుకుతాయి?

సూర్య: ఇప్పుడన్నా యియ్యండి.

సచ్చి: అబ్బాయిని యిట్లా యివ్వండి. యెంగిలిచేస్తా డేమో! మంత్రించిన నీళ్లు. కడుపు కాల్చేస్తాయి, యెత్తుకు పోసుకోకపోతే!

[మాధవుడు యెప్పటిచోటికి వెళ్ళాడు. అయిదు నిమిషాలు యెవరూ మాట్లాడరు. స్వాములవారు జపం చేస్తున్నారు. దుర్గమ్మ కునికిపాట్లు పడుతోంది]

కన: (అమృతంతో) ఇంకా ఎంతదూరముందండీ ఊరు!

అమృ: ఏమోయి, బండిఅతను!

బండి: యిరవై మైళ్ళు.

అమృ: యెప్పటికి చేరుకుంటాం!

బండి: రాత్రి పదింటిలోపు.

దుర్గ: అప్పుడా వంటలు చేసుకునేది?

సచ్చి: వొండుకునే దేమిటి? దుకాణాలు కట్టేస్తారు.

కన: ఎట్లా?

మాధ: అమ్మా! యెట్లా! చాలా ఆకలేస్తోంది.

అమృ: నాకూనూ. నిన్న రాత్రికూడా భోజనం లేదు.

సూర్య: మన కెవరికీ యేమీ తెచ్చుకోవాలని తట్టలేదు.

దుర్గ: నాకు జ్ఞాపకముంది. కాని తెచ్చుకుంటేమాత్రం, యెట్లా వీళ్లలో తినడం? వంటలకి రాజాంలోపున, తోవలో ఆగడం భయమయ్యేను!

అమృ: అడావిడిలో అన్నీ మరిచిపోయినాం. ప్రాణాలు దక్కితే చాలనే వుద్దేశ్యం తప్ప—

కన: నాకూ కళ్లు తిరుగుతున్నాయి.

సచ్చి: జంప్ శ్రీశ్రాగారం. సన్యాసులం మా కెందుకూ భోజనాలున్నా వొకటే లేకపోయినా వొకటే. యెన్నాళ్లైనా యిట్లానే కూచుని వుంటాం! ఆకలి దప్పులు వొదిలేసి వాయు భక్షణం చేసి వుంటాం.

[సత్యం బండిలోంచి బుట్ట తీస్తోంది.]

యెవరన్నా యేమన్నా పెడితే తింటాం. లేకపోతే అక్కర్లేదు. మీ రెవరన్నా యేమన్నా తెచ్చుకుంటే సన్యాసికి ముందు పెట్టకండా తినరు కదా! లేకపోతే లేనే లేదు.

(సత్యం బుట్టవిప్పి, అన్నీ చుట్టూ పరుస్తోంది. అటు కలూ, అరిటిపళ్ళూ, కొబ్బరీ, శనగపప్పూ, జిలేబీ, మినపరొట్టె, మాంసం కుండా]

సత్యం: యింకా మీ రెవరన్నా మీ ఫలహారాలు తింటా రేమో నేనూ అప్పుడే తినొచ్చుననుకున్నా. కాని మీ రెవరూ తెచ్చుకోకపోతే యింకేముందీ......

[తింటోంది. కొంచెం బండి వాడికిస్తోంది. అందరూ వాటి కేసి చూడడం, కళ్లు తిప్పేసుకోడం)

సూర్య: యెన్ని తెచ్చుకున్నావే, తినడానికి? యిక్కడ వున్నవాళ్లందరం తిన్నా యింకా మిగులుతాయి.

మాధ: అమ్మా, అమ్మా!

సూర్య: యెట్లానయినా తెలివిగలవాళ్లు తెలివిగలవాళ్లే, యిందరమున్నాం వొక్కరికీ జాగర్త వుందీ?

మాధ: నాన్నా! నాన్నా!!

సత్యం: యెంతదూరముందో యేమో తెలీదు. అందుకని యిన్ని తెచ్చుకున్నా. దోవపొడుగూతా సరిపోవడానికి.

మాధ: నాన్నా! అమ్మా! ఒకటి......

సత్యం: (సూర్య ప్రకాశంతో) రెండరటిపళ్లు తీసుకుంటారా యేం?

సూర్య: యేమోలే, యెందుకులే! యెంతచెడ్డా......

దుర్గ: దాన్ని పుచ్చుకోగాలేనిది, దానిదగ్గర పళ్లు తిన డానికి శోత్రియం వొచ్చింది గావును! అన్నీ వేషాలు! తినండి.

అమ్మ: దానియింట్లో యెప్పుడూ తినన ట్లే......

సూర్య: అయితే అదివేరు. (సత్యంతో) పోనీ, తేవే! యిందరు చెపుతూవ్రుంటే! (స్వాములవారితో) యేమంటారు స్వాములవారు?

సచ్చి: తప్పకుండా తినవొచ్చు. యిట్లాంటి సమయాల్లోనా! లకలేస్తే వ్యాసుడు పందిమాంసంతిన్నాడు. నారదుడు కొడుకుల్ని వొండుకు తిన్నాడు. వసిష్ఠుడు బోగందాని చేతుల్లో......

దుర్గ: నిజమేనండీ? నేనెక్కడా వినలేదే! కాని మును లట్లా చేశారుగాని, వితంతువులు యెక్కడన్నా పురాణాల్లో తిన్నట్లు దృష్టాంతరాలున్నాయా?

[సూర్యప్రకాశం తింటున్నాడు.]

సత్యం: ఆ జిలేబి తీసుకోండి. వొట్టి పళ్లతో......

సూర్య: యెంతచెడ్డా బ్రాహ్మణ పుటక......

మాధ: అమ్మా! అమ్మా......

కన: అమ్మాలేదు. గిమ్మాలేదు. వూరుకో.

సచ్చి: జయ్ శీతారామ్.

మాధ: అమ్మా! నాకడుపు కాలిపోతోంది.

కన: యెక్కడపుట్టావురా, వెధవా నువ్వు! నాప్రాణాలు తోరికేస్తున్నావు!

మాధ: చచ్చిపోతున్నా. యింక బతకను.

కన: చచ్చావన్నా కావు. నాకూ కళ్లు తిరుగుతున్నాయి. యేం చెయ్యను? కుళ్లుముండ లందరికి తిండివుంది, యీ లోకంలో......

దుర్గ: అంతేనమ్మా! న్యాయానికి రోజులుకావు. అన్యాయంగా ఆర్జించేవాళ్ళకే కడుపునిండాతిండీ. ఇదేం లోకమో! దేవుడెక్కడున్నాడో?

సచ్చి: మేమింక ఆగం. యెప్పుడు సన్యాసులం అయినామో, అప్పుడే బికుకులం. మాకు అన్ని బంధనాలూ తెగాయి. యింకేమిటి?

(సత్యంవేపు చెయ్యిజాచి) భవతీ, భిక్షాం దేహి!

[సత్యం తెల్లబోయి ఆయనవంక చూస్తోంది]

సచ్చి: నీకర్థంకాలేదు గావును. కడుపు కాలిపోతోంది అని. రెండిట్లా పారెయ్యి అన్నమాటే.

[సత్యం ఆయనకి అరిటిపళ్లిచ్చింది]

సచ్చి: (అవి కుక్కుకుంటూ) యీపళ్ళేనేం? ఆజిలేబీ అవికూడా యియ్యవే. సన్యాసులకి పెట్టినఫలం యెన్ని జన్మాలకీ పోదే.

సత్య: వొండినవి మేముతాకితే, తినరనుకున్నా. తింటే సంతోషం. యిందండి.

సచ్చి: (తీసుకొంటూ) నాకు కులమేమిటే? సర్వం ఏకం

దుర్గ:- (సచ్చిదానందస్వామితో) తమరు కొంచెం మంత్రించి, ప్రసాదం దయచెయ్యాలి. మళ్ళీ యెప్పుడో తమర్ని కలుసుకోడం. యిట్లాంటప్పుడు కాకపోతే, మహాత్ముల చేతినించి తినడం మళ్ళీ తటస్థించదు, యీ పాపిష్టి జన్మానికి.

(స్వాములవారి దగ్గర్నించి, తనంతట తనే తీసుకు తింటోంది. బుట్టలో అన్నీ అయిపోతున్నాయి. కనకమ్మ చూసింది.)

కన:- పడిపోతున్నా. నాకళ్ళు తిరుగుతున్నాయి. పోతున్నా, పోతున్నా. కాని అవి నాగొంతుకలో కూరకండి. దానివి నాకేంవొద్దు. బలవంతం చెయ్యకండి. ఆజిలేబి బలం చేస్తుంది. కాని అది నాకసలొద్దు.

[పడిపోతోంది, అమృతం, నోట్లో పెడుతున్నాడు. కళ్ళుమూసుకుని అట్లానే తింటోంది. మింగి నోరు తెరుస్తుంది. కాని కళ్లు తెరవదు. తన చేత్తో తీసుకోదు.)

(తెరపడింది)

# రెండో రంగం

[రాత్రి పదిగంటలు. రాజాంలో సత్రం. హాలుగో కంబళిమీద అందరూ కూచునివున్నారు. స్వాములవారు జింకతోలు పరుచుకున్నారు. దుర్గమ్మ కింద కూచుంది. ఆమె నానుకొనే సత్యం కూచునివుంది. ఆమె నానుకొనే కనకమ్మ కూచుంది. సత్యంతో అందరికీ చాలా స్నేహమైంది. ముఖ్యంగా ఆడవారికి మరీ స్నేహం. అందరూ సంతోషంగా మాట్లాడుకుంటో తాంబూలా లేసుకుంటున్నారు.]

అమ్మ:-తొందరగానే చేరుకున్నాం. చాలా రాత్రవుతుందని భయపెట్టారు.

సూర్య:-రేపు పొద్దున్నే బయలుదేరితే సాయింత్రానికి చేరుకుంటాం.

సదా:-యేమో, చేరుకున్నదాకా నిశ్చయంలేదు. అంతా ఈశ్వరకరుణ. జయ్ శీతారాం.

దుర్గ:-యిందాక మనచీట్లుచూశాడుగా, ఆటురకఆయన!

కన:-యామన్నాడు ?

అమ్మ:-సరే, వెళ్ళవొచ్చన్నాడు.

దుర్గ:-మళ్ళీ యీనాటికి కడుపునిండా భోజనం చేశాము.

అమ్మ:-పాపం, సత్యంలేకపోతే మనందరిపనీ అయ్యేదే!

సూర్య:-దీనిమేలు నేనెన్నడూ మరచిపోను.

అమ్మ:-యీసారన్నా ముందేజాగ్రత్తపడి, కావలసినవన్నీ తీసికెళ్ళాలి.

దుర్గ:-యింకోసారి పొరపడతామా! మనం బయలుదేరే ముందే అంగళ్ళు తెరుస్తారు.

సచ్చి:-గుణం వుండాలిగాని, జాతీ, నీతీ, యేమిటి? యెందుకు పెద్దబొట్లూ, మడిపంచలూనూ! ఆఖరికి బోగందాని కుండే అవుదార్యమన్నా వుండదు.

సూర్య:-దాన్ననడమెందుకు? దానివృత్తి దానిదీ, యెవరివృత్తి వారిదీ.

సచ్చి:-కాని ఆజాతిలోకూడా, దీనికున్నంత మంచిబుద్ధి యెవరికీ వుండదు. యామంటావు, కనకమ్మా?.

కన:-నాప్రాణాలూ, మాఅబ్బాయి ప్రాణాలూ నిల

పెట్టింది. దీనిమేలు నేనెన్నడూ మరిచిపోను.

అమ్మ:-ప్రాణమన్నా యియ్యాలన్నంత కృతజ్ఞత పుట్టింది నాకు.

సచ్చి:-స్వార్థత్యాగం, దయా, యిట్లాంటి గుణాలు...

(తురక జవాను వొచ్చాడు)

తుర:-యిక్కడ సత్యం యెవరు ?

సత్యం:-నేను.

తుర:-మాసర్దారు నిన్ను రమ్మంటున్నారు.

సత్యం:-మీ సర్దారుకి నాతో యేంపని ?

తుర:-యేమో ! రా, తెలుస్తుంది.

సత్యం:-నేను రాను.

తుర:-యేం లాభం, సరిగా రాకపోతే, లాక్కెడతారు. మర్యాదగా రా.

సత్యం:-రానని చెప్పు, పో.

తుర:-సరే, కాచుకో, తురకదెబ్బ. (వెడుతున్నాడు).

(ఒక నిమిషం నూర్లాడరు)

కన:-యిదేమిటి, వున్నట్లుండి ?

సూర్య:-చూశారూ, వెధవ తురక నౌకరు పొగరు ?

సచ్చి:-మనమంటే, యింత చవకయింది వీళ్లకి ! విజయనగరం యీ తురక సహాయం అడిగినందుకే కదూ ?

కన:-పిలవగానే వొస్తారనేగావును, ఆడవాళ్ళు! మంచి పని చేసింది. అంతేకావాలి. నౌకర్లమా యేం ?

అమ్మ:-కావలిస్తే తనే రాకూడదూ ? యిక్కడికి ?

దుర్గ:-హిందూ ఆడవాళ్లంటే అంత చులకన వాళ్లకి.

నన్ను పిలిస్తే తెలిసేది.

సచ్చి:-(సవ్వాణో) నిన్నెవరు రమ్మంటారు ?

అమ్మ:-చాలా బాగా అంది, పీడాబాయిరి. బొబ్బిలి వాళ్లకి కీర్తి తెచ్చింది.

సచ్చి:-ఆడదంటే అట్లా వుండాలి.

దుర్గ:-రాకపోతే యేమిటో చేస్తాట్ట. యేం చేస్తాడు ?

కన:-లాక్కుపోతాడుగావును.

అమ్మ:-మనందరం వూరుకుంటామా, చూస్తో ?

దుర్గ:-యెవరయితేనేం ? స్నేహానికి స్నేహం.

సూర్య:-వూరుకోకూడదు. దాని వొంటిమీద చెయ్యి పడనియ్యకూడదు. యిందరమున్నాం.

సచ్చి:-అయినా యెందుకో రమ్మంది ?

సూర్య:-యింకెందుకు ? కళ్ళు కనపడుతున్నాయా వీళ్లకి ? యిప్పుడే చెప్పుతున్నా. మనస్త్రీల మానం మనం దరం కలిసి నిలుపుకోవాలి. స్నేహం మరవకూడదు.

[జవాను మళ్ళీ వొచ్చాడు. స్వాములవారు యేం చూడనట్లు జపం మొదలుపెట్టారు.]

జవా: ఆఖరుసారి మంచి మాటలతో వొస్తావా, రావా, అని అడుగుతున్నారు.

సత్యం: ఒకమాటు రానని చెపితే తెలీదూ, మీసర్దారుకి?

జవా: మీ అందరితోకూడా చెప్పమన్నారు. మంచి మాటలు చెప్పి పంపించండి దాన్ని యీరాత్రి ఆయన దగ్గిరికి వెంటనే. లేకపోతే మీమీద కూడా ఆయనకి ఆగ్రహం

వొస్తుంది. యింకో అరగంటలో వొస్తారు.

(వెడుతున్నాడు.)

అమ్మ: యెందుకు రమ్మన్నాడో, యేమిటో, కొంచెం ఆలోచించవలసిన విషయమే.

దుర్గ: యెందుకో వెళ్ళి అడిగొస్తే, పోయిం దేముంది?

కస: యెంతయినా అధికారి. ఆయన చేతుల్లో వున్నాం.

దుర్గ: వూరికే, చీటీ మళ్ళీ చూడ్డానికో, దేనికో, రమ్మన్నాడు. వెడితే మాత్రమేం?

సత్యం: నాకు తెలుసులెమ్మనూ, యెందుకు రమ్మంటున్నాడో.

కస: యెందుకయినాను, వెడితే యిప్పుడేం పోయింది? తప్పేముంది?

సత్యం: నేను వెళ్లనని మీకుకూడా మళ్ళీ చెప్పాలా యేమిటి?

అమ్మ: వెళ్లనని దుడుకుగా అనేస్తే సరా! ఆవొక్క మాటతో అయిందా? తరువాత దానివల్ల కలిగే కష్టనిష్టూరాల సంగతికూడా ఆలోచించాలి. ఆయనచేతుల్లో వున్నవు మర్యాదగా అడిగాడు. ఆ మర్యాద నిలుపుకోకపోతే అవమర్యాద చేస్తాడు. యింతేగాని తప్పించుకునే దెట్లాగూ లేదు.

సత్య: బలవంతం చెయ్యమనండి! ఆదేశద్రోహి, కులహీనుడు తురక, వొక్కడూ వుండి, రాత్రి నన్ను రమ్మంటే నేను వెడతానా?

సూర్య: ముందే యెందుకట్లా అనుమానపడతావు? వెళ్ళి యెందుకో చూసి, అట్లాంటి సంగతి వుంటే, వొచ్చెయ్యి.

అట్లానే అని నిశ్చయమైతే, నేను మాత్రం నిన్ను వెళ్ళమంటానా?

సత్యం: (సూర్య ప్రకాశంతో) మీమాటతో సెయ్యలేక వెడుతున్నా. (వెళ్ళింది)

కన: రోజుకి పదిమందిని చూసేదానికి అభిమానమంట! అన్నీటక్కులు, మనచేత బతిమాలించుకోడానికి!

దుర్గ: నాలాళ్లూ, మంగలాళ్లూ, అందరూ పనికిరాగా లేనిది, నిక్షేపమంటి సర్దారు వెగటయినాడు గావును!

కన: అతిన్నిందాక చూశాను. యెంత తీవిగా వున్నాడని! కళ్లు తిప్పుకోలేక పోయినాను. అతనిభార్య యేంనోచుకుందో!

అమ్మ: పోనీ నువ్వు వెళ్ళకపోయినావు దీనిబదులు?

కన: ఛీ!

అమ్మ: యేం?

కన: నేనేం బోగందాన్నా?

సూర్య: తురకసర్దారుకి కళ్లు లేవనుకున్నారా యేమిటి?

(సన్యాసి కళ్లు తెరిచాడు)

సచ్చి: జయ్ శీతారామ్. వెళ్ళిందీ లంజ? రక్షించింది.

(సత్యం కోపంతో రోజుకొంటో వొచ్చింది)

సూర్య: యేమిటి? వ్వేమిటి?

సత్యం: తురక వెధవ! మున్నపోతు! వాడికా నేను చిక్కేది? వెళ్ళమంటారు మీకేం!

దుర్గ: (నవ్వుతో) యేంచేశాడు? మొదటినుంచి అంతా చెప్పు.

సత్యం: యేంచేశాడా? అక్కడికి వెళ్లు- తెలుస్తుంది.

సూర్య: (నవ్వుతో) యెట్లా తెలుస్తుంది? యీ తెల్ల ముసుగును చూసి.........

అమ్మ: (నవ్వుతో; యిద్దరిబోడిగుళ్ళూ.........

సత్యం: మీకేం? మీకు నవ్వుగానే వుంటుంది! వెళ్ళమని మాత్రం బతిమాలుకోడం తెలుసు.

సూర్య: మనం యింక వూరుకోగూడదు.

కన: యెంతమాత్రం వూరుకోకూడదు. యిప్పుడు దీన్న యింది యింకాసేపటికి......

దుర్గ: దాన్నేగనక సరిపోయింది. మనన్నెవరినన్నా అయితే...

సచ్చి: హిందూధర్మాన్నంతా మంట గలిపారు. యిట్లానే. హిందూ పాతివ్రత్యాన్నంతా పాడు చేశారు...యీ మ్లేచ్ఛులు.

అమ్మ: యేం చేద్దాం?

సూర్య: అందరం వొకటిగా వెళ్ళి......

(తురకజవాను మళ్ళీ వొచ్చాడు.)

తుర: యీ బోగంది మాసర్దారు మాటచెప్పడానికి దగ్గిరికివొస్తే, ఆయన్ని మొహంమీద కొట్టి, వుమ్మేసి వొచ్చింది. యిదంతా మీరు కలిసి చేయించిన పని. మీరు రాజద్రోహులు. పన్నెండు గంటల్లోగా, యీరాత్రి దీన్ని, ఆయన దగ్గిరికి నెమ్మదిగా పంపించాలి. పంపకపోతే, యిక్కడున్న ఆడవాళ్ళని నౌకర్లు తీసుకుపోతారు. తక్కిన వాళ్ళందరినీ ఖైదుచేస్తాము. మీ ప్రాణాలకి మేము జవాబుదారి కాదు. అందాకా ఒక్కరూ యిక్కణ్ణించి కదలడానికి

వీల్లేదు. పన్నెండింటికి మళ్ళీవొస్తాను.

(వెళ్లిపోతున్నాడు.)

సచ్చి: హాయేబుగారూ, వొక్కనిమిషం ఆగండి.

అమ్మ: మేమేంచెయ్యం?

దుర్గ: దానికీ మాకు సంబంధమేమిటి?

సచ్చి: అది రాకపోతే మమ్మన్నెందుకు కయిదు? తీసి కెళ్ళండి మే మేం వొద్దన్నామా!

కన: మేము గతిలేక అది కూచున్న బండిలో యెక్క వలసి వొచ్చింది. కాని అదెవరు మేమెవరు?

తుర: మాసర్దార్ దొంగ కాదు. చాలా మర్యాదస్తులు. తెలీటంలేదు? రానన్నవాళ్ళని బలవంతం చెయ్యడు. మీరే దాన్ని యిష్టపడేట్టు చేసి పంపాలి.

దుర్గ: పోసి వెళ్ళవే!

అమ్మ: అవును. వెళ్ళు.

సత్యం: నేనా వెళ్లేది?

సచ్చి: (జవానుతో) చూశావా మరి!

అమ్మ: నీ పెంకెతనంవొల్ల మాకిబ్బంది వొచ్చిందికద!

దుర్గ: యింత పట్టు పనికిరాదు యెవరికీ.

సత్యం: నేనే వెళ్ళేది?

(జవాను వెడుతున్నాడు.)

అమ్మ: మాముందా నటన! తెలీనివాళ్ళదగ్గిరికి వెళ్ళు. మాదేవుడు? బొబ్బిలి. నీవంటివాళ్ళని—.

దుర్గ: సరేలెండి. యిప్పుడేం చేద్దాం?

కన: చేసేదేముంది? అది వెళ్ళితీరాలి. వెళ్ళకపోతే ఆయన

వొప్పుకోడు. అన్నంతా చేసి తీరతాడు.

దుర్గ: ఇంతమందికి తనవల్ల హానికలుగుతోవుంటే, అది మాత్రం చూస్తో వూరుకుంటుందా?

సత్యం: ఆ పశువు దగ్గరికి, రాజద్రోహి దగ్గిరికి, నేను వెళ్ళను. నా ప్రాణంపోయినా నేను వెళ్ళను.

కన: ఒక్క ప్రాణం కాదు.

అమ్మ: యిద్దరు పతివ్రతాస్త్రీల మానాలు——

సత్యం: నాసంగతి?.........

దుర్గ: యిట్లాంటిదాంతో ప్రయాణం చేసినఫలం. మన మేంచేశాము మనకీగతి! దీనిమీద వాడికి కన్ను పడడమేం? మధ్య మనని బెదిరించడమేం? మనకీ దీనికీ సంబంధమేమిటి?

సచ్చి: జయ్ శీతారామ్! మీ అందరికీ మతిపోయిందా? దానికున్న బుద్ధి మీకుంటే యింకేంకావాలి? దేశభక్తిచేత ఆవేశపడి అట్లా అన్నదేగాని, మన అందరి ప్రాణాలూ పోతోవుంటే చూస్తో వూరుకుంటుందా? తన ఫలహారాలన్నీ మనకి పెట్టలేదూ? యెటువంటి హృదయం దానిది! దాన్ని తిట్టి వృథాగా కోపం తెప్పించకండి.

అమ్మ: అవును. భోగంవాళ్ళకున్న. దయా, ప్రేమా, కులస్త్రీల మనుకునే వాళ్ళకి వుండనే వుండవు.

సత్యం: యేమయినా సరే నేనీపని కొప్పుకోను. పదివేల సార్లు నన్నూ మీరందర్నీ, యీలోకాన్నంతా చంపినాసరే.

సచ్చి: పుట్టినతరవాత యీలోకంలో అంత స్వార్థంవుండ కూడదు. యింతకీ నాసంగతేమిటంటావు గాని, మా అందరి సంగతీ ఆలోచించవు. అన్ని ఆత్మలూ వొకటే. నీఆత్మ

ఎట్లాంటివో మావీ అట్లాంటివి కావూ? ఒక్క ఆత్మ కొంచెం కష్టపడకూడదూ, యిన్ని ఆత్మలకోసం? అందులో నీకు పాపమేముంది! మా ప్రాణాలే పోతున్నాయి. మేమందరమూ చేసే లోకోపకారమంతా ఆగిపోతుంది. నీవు చేసే వుపకారమూ సాగుతోనే వుంటుంది. ఇంతలో పోయిందేమిటి? "పరోపకారార్థ మిదం శరీరం" అనేదానికంటే గొప్ప ఆదర్శమున్నదా? ఎందుకాలోచిస్తావు? ఎందరు మహాపతివ్రతలు వారి శరీరాలిచ్చేశారు, యితరుల వుపయోగార్థం? మనది కాదనుకోవాలి. యీ శరీరాల్ని మలినం చేస్తాడుగాని, ఆత్మనేం చెయ్యలేడుకదా? కావలసింది కీర్తి. మాకు సహాయంచేస్తే, వొచ్చే కీర్తికంటె నీపాపిష్టి జన్మకెక్కు వేంకావాలి? భగవద్గీతల్లో శ్రీకృష్ణభగవానుడన్నదేమిటి? కార్యం ఫలితాని కాశించకుండా చెయ్యాలి. 'ఓయీ, అర్జునా, యీ దేహము అనిత్యము. ఆత్మ నిత్యము. ఆత్మనంటేది పరోపకారం చేశామనే సంతుష్టి.' నువ్వు నా బిడ్డవి. నేను సర్వాం త్యజించి, అద్వైతపదవిని పొందిన యోగిని. నన్నేంచేసినా నాకు భయంలేదు. సుఖదుఃఖాలూ, పుణ్యపాపాలూ అన్నీ వొకటే నాకు. నామాట వినకపోతే నీకు గతులుండవు. ఖింటే జన్మరాహిత్యమవుతుంది నీకు. శరీర మేంచేసినా లక్ష్యం లేక పోవడమే అహం నాశనము కావడమే, నీతీ అవినీతి, లేకపోవడమే, ఉత్కృష్టమైన వేదాంతము. వీడు తురక, వీడు బ్రాహ్మణు వీడు దేశభక్తుడు, వీడు దేశద్రోహి అనుకోవడమే, అవివేకము, మాయ. అంత ఆత్మవొకటే, సృష్టి కారకుడు ఆపరమాత్మే,

యిన్ని మూర్తులై సృష్టిస్తున్నాడు. యీ భేదబుద్ధి పాటించడము అజ్ఞానము. ఆ తురకను నిందించడం, పనికిరాడనడం, యీశ్వరుణ్ణే నిందించినట్టే! మీకులం వుత్కృష్టమైన కులం. భేదం పాటించకుండా ప్రతివారికీ వుపయోగపడుతుంది. దాని కొరకే ఋషులు యోచించి యివన్నీ యేర్పరిచారు, సనాతనధర్మంలో. తెలుస్తోందా?

సత్యం:- తెలుస్తోంది......కొంచెంగా—

దుర్గ:-యిట్లాంటి పనులు సువ్వు చెయ్యాలా, యిదివరకు?

సత్యం:-లేదు

దుర్గ:-అబద్ధాలెందుకు చెపుతావు? నావంటివాళ్ళ కేతప్ప లేదు. మొదట మా ఆయన మీదా నాకిష్టంలేదు. నోరు మూసుకు వూరుకోలా నేను మరి?

సత్యం:-నాకట్లాంటి కర్మమెందుకు? నాకిష్టంలేనివాణ్ణి పొమ్మంటాను. అందుకనే యీ బలవంతం నాకు కష్టంగా కనపడుతోంది. యిట్లా బలవంతం చెయ్యబడడం మీకు అలవాటే గనక సులభంగా కనబడుతోంది మీకు.

దుర్గ:-మఱితప్పుతుందా? భర్త అయినాక, యిష్టమున్నా లేకపోయినా, లోబడితీరాలి.

(లోపల గంట)

అమ్మ:-పదకొండున్నర. యింకా యేం తేలలేదు. యీ యిద్దరినీ లాక్కెళ్ళడమే అయితే యెట్లాగో సహించవొచ్చు.

కన: (సత్యంతో) యిదిగో యేమే! విను. యెట్లానూ నీకు అదితప్పదు. మర్యాదగా వెళ్ళకపోతే, బలవంతం తప్పదు. పైగా యీ కోపంతో తరువాత చంపేస్తారు. దాని

బదులు యీశాస్త్రకెందుకు గోలచేస్తావు? యేం? అరిగి పోతావా? బతికుంటే వచ్చే సౌఖ్యాలు తలుచుకో. చస్తే యింకేముంది?

సత్యం: మీకే యిటువంటి యిబ్బంది తటస్తిస్తే!

కన: ఆనాలుగు నిముషాలూ కళ్లుమూసుకుంటూ! సరేనా?

సత్యం: చెపితినిగా! పెళ్లయినవాళ్లకిది అలవాటని! అట్లా శరీరాలు మొగవాళ్ళకి యిష్టంలేకపోయినా వొప్ప చెప్పెయ్యడం!

దుర్గ: ఆ సరదారుడు మర్యాదస్తుడే, మధ్య దీనికొచ్చింది గాని! ముగ్గురం ఆడవాళ్లముంటే బోగందాన్నే యేరు కొన్నాడు. యింకెవరి మీదన్నా కన్నేస్తే, యింకేమన్నా వుందా? అయినా తప్పేదా? నోరుమూసుకుని......

కన: బోగంముండలకి పాతివ్రత్యం వొచ్చిందికద!

సచ్చి: అమ్మాయీ! నీకు భయమెందుకు? వూరికే పంపుతాడా, యేంముట్టచెప్పకుండా, అంత గొప్పవాడు! యీయన్ని సంతోషపెట్టిన సంగతీ, యీయన నీకోసం యింత ఆసించిన సంగతీ తెలిస్తే యింక నీ ఐశ్వర్యం తలు చుకో? పాదుషా దర్శనంకూడా అవుతుంది. అప్పుడు యింక మాతో మాట్లాడుతావా? అంత అదృష్టాన్ని...

సత్యం: అంత అదృష్టాన్ని యింకెవరికన్నా యిప్పించండి, నాకొద్దు.

కన: యెంతమంది పతివ్రతలు మానాన్ని త్యాగం చేశార్లుకారు? స్త్రీజీవమంటేనే త్యాగం. యితరుల కియ్య

జానికేగా స్త్రీ! యెంత పుణ్యం పురుషునికి త్యాగంచేసి యివ్వడం?

దుర్గ: పోనీ, కులస్త్రీ అయితే అనుకోవచ్చు. యివతల పెనిమిటనీ, పిల్లలనీ.

సత్యం: మీకెవరూ లేరుగా!

సచ్చి: వేశ్యకికూడా యింతమాత్రం తెలివి లేకపోవడం ఆశ్చర్యంగావుంది. కులస్త్రీలయితే సరే శుద్ధ అవివేకులు. వత్సా! నేను వుపదేశించేస్తున్నా విను. ప్రేమతత్వం. జగమంతా ప్రేమమయం. ప్రేమ సృష్టికి మూలకారణం. ఆలోచించు, ప్రేమలేకపోతే సృష్టికూడా నిమిషాల్లో ఆగిపోతుంది. ప్రేమని నిరాకరించడంకన్న మహాపాపం లేదు.

సత్యం: మీకూ అంతేనా?

అమ్మ: పోనీ, యిది విను. ఆ తురకాడికి బొబ్బిలి మజా చూపించు. బొబ్బిలి బోగందాని ముందు యే తురకసానులూ పనికిరారని తెలిపించు.

సత్యం: బొబ్బిలి బోగంది చూపించింది తన సంగతి తురకవాడి దవడమీద.

(తురక జవాను వొచ్చాడు.)

తుర: యేం?

సత్య: నేను రాను.

సచ్చి: (సూర్యప్రకాశంతో) యింక మాచాతకాదు. మీకేమన్నా లొంగాలి.

సూర్య: (ఆలోచిస్తూ) సత్యం నాకేంచెప్పాలో తోచక వూరుకున్నా యిందాకణ్ణించి. కాని ప్రాణంకంటే యెక్కు

వేమిటి? మా అందరి కొంపలూ ముంచేటట్టున్నావు. నేను చెప్తున్నా వెళ్లు. మమ్మనందరినీ చంపడానికి నీకేమీ హక్కు లేదు. వెళ్ళు. వెళ్ళకపోతే, యీ జన్మంలో నేనింక నీమోహం చూడను.

(సత్యం తురకజవానుతో వెళ్ళిపోయింది)

సచ్చి: (సూర్యప్రకాశంతో) యీ వుపకారం యున్నటికీ మరిచిపోము.

దుర్గ: అమ్మా! బతికాము.

కన: వుండు వుండు. అప్పుడే? చివరదాకా వుంటుందో—

సూర్య: అంతే? నేను వెళ్ళమన్న తరవాత. మళ్ళీ రావడమే?

కన: ఆడదాన్ని అట్లా వొంచే మొగాడే లేకపోతే యింకేమన్నా వుందా?

సూర్య: పాపం, మన ప్రాణాలకోసం, దాన్ని ఆవిధంగా.

దుర్గ: దిగులెందుకు? అంతబాగావున్నాడు ఆ సరదారు? అంతకంటే మంచివాడు దొరుకుతాడా యేమిటి దానికి?

సూర్య: యింకెవరికి గాని.

అమ్మ: పాపం, చివరికి ఆ తురకవాడి దగ్గిరికి వెళ్ళేరాత రాశివుంది దానికి? మనమేం చేస్తాం?

సదా: యెంతకష్టపడుతోందో? యేంచేస్తాం మరి? అంతా యీశ్వరమాయ. జయ్ శీతారామ్.

(తెర పడింది.)

# మూడో రంగం

[రోడ్డుప్రక్కన చెట్టుక్రింద అందరూ కూచునివున్నారు. సత్యం మాత్రం దూరంగా కూచునివుంది. మధ్యాహ్నం పన్నెండు గంటలు.... సత్యం రూపం మారిపోయింది. జుట్టు రేగింది. మొహంమీద కన్నీళ్ళ మచ్చలు.]

అమ్మ: వూరింకా యెంతదూరం వుందోయ్ ?

బండి: అయిదుమైళ్లు.

దుర్గ: ఇంక ఫలహారాలు చెయ్యొచ్చు.

(సత్యంతప్ప తక్కినవాళ్ళందరూ, మూటలు బయటికితీసి, విప్పుకుంటున్నారు.)

బండి: (సత్యంతో) నువ్వేం తెచ్చుకోలేదూ ?

సత్యం: లేదు. నాగోలలో నాకు తిండి జ్ఞాపకముందా? అయినా నాకింక తిండెందుకు ? యీ దేహాన్ని కాల్చినా చేసిన పాపం పోదు. ఆ వెధవ, రాక్షసి, పశువు, వాడికి...

బండి: ఆకలిగా లేదు ?

సత్యం: మండిపోతోంది. మండనీ కొంతపాపమన్నా...

బండి: పాపం, యీమె కాకలిగావున్నదిటండీ.

(యెవరూ వినిపించుకోరు. రెండునిమిషాలు మాటల్లేవు.)

దుర్గ: నేను యీ పేలపిండి మాత్రం, యెవరినో అడిగి తెచ్చుకున్నాను. యీరోజొకటి వొద్దంటోవుంటే బలవంతంగా యిచ్చారు. వాళ్ళంత ప్రేమతో యిచ్చింది యింకోళ్ళ కియ్యనా ?

కన: నా అక్కాయికని యీ మిఠాయి తెచ్చాను. యేమీ మిగలను.

సచ్చి: నా శిష్యులిస్తే యీ పళ్ళు తెచ్చుకున్నా, యివి ప్రసాదం. వీటిని అట్లాంటివాళ్ళని తిననియ్యకూడదు. కాళ్లు పడిపోతాయి, తింటే. తురకవాడి......

సూర్య: నేనుమాత్రం యేం చెయ్యను, పాపం, పాపం!

కన: అబ్బా! అందరం ఒకబండిలో యెక్కడమే సిగ్గుచేటు తురకదాని సాపత్యం.....యీ ఘోరపాప మెట్లా పోదులుతుందో?

అమ్మ: అందరం యిక్కడ బ్రాహ్మలమే! మనం తింటో వుంటే శూద్రులు కొంచెం కనబడకుండా కూచుంటే బావుంటుంది.

దుర్గ: అక్కడే ఆ తురకాడితో యెంత బావుండేది? యింకోవూరికొచ్చి అక్కడ నిర్మలమైనవాళ్ళని పాడు చెయ్యడానికి కదూ?

[మాధవుడు లడ్డుండ తీసుకుని లేస్తున్నాడు.]

కన: యెక్కడికి?

(సత్యంవేపు చూపుతున్నాడు.)

కన: ఛా, బాబూ! యియ్యకు మంచిది కాదు.

మాధ: నిన్న మనకియ్యలా!

కన: యెవరికోస మిస్తుంది, బ్రాహ్మలకి? దానివేపు వెళ్ళకు.

(సత్యం యేడుస్తోంది.)

సచ్చి: పాపం, ఆ తురకవాణ్ణి తలుచుకుని యేడుస్తోంది.

దుర్గం: కాదు, సిగ్గు. మన మొహాలు మళ్ళీ యెట్లా చూస్తుంది; ఆ పాడుపనిచేసి?

అమ్మ: బోగందయినా, కులం అనేది పోయింతరవాత.

(సత్యం పడిపోయింది)

బండి: కొంచెం నీళ్ళండీ, నీళ్ళు.

సచ్చి: నాలుగే గ్లాసులున్నాయి. యెవరిస్తారు దానికి? ఆ తురక యెంగిలి కూడాను! మనమేం చెయ్యగలం? యీశ్వర మాయ. జయ శీతారాం.

కన: అది చేసుకున్న ఖర్మం. యిట్లానన్నా కొంత అనుభవిస్తే వొచ్చేసారి మంచి జన్మమన్నా వొస్తుంది.

సచ్చి: యెన్ని యిట్లాంటి పాపాలుచేసి యెత్తిందో, యీ పాడుజన్మ?

దుర్గ: మొదట బెట్టుచేసిందిగాని, మొదటినించీ యిష్టమే ఆ తురకాణ్ణి చూస్తే.

కన: దీంతో వొకే బండిలో వూళ్లో కెట్లా వెడతాము? యెవరన్నా చూస్తే? దీనిసంగతి అందరికీ తెలిసివుంటుంది యింకేమిన్నావుందా?

దుర్గ: అవును. దీన్ని ఇక్కడేవుంచండి. దాన్నియెత్తి లోపల పెట్టే దెవరు?

అమ్మ అవును. బండిలో దీనికి పడుకోడానికి చోటెక్కడుంది? యేమోయీ బండి అతనూ, నీకు బాడుగిచ్చిందా?

బండి: ఆ.

సచ్చి: సరే. బల్లెక్కండి. దానికర్మం బావుంటే, దోవ

పోయేవా డవడన్నా, దీనిసంగతి తెలీక, గొంతుకలో నీళ్లు పోస్తాడు.

బండి: ఆమె పెట్టెవుందండి బండిలో.

సూర్య: ఆ నగలూ, చీరెలూ నేనిచ్చినవే! వుణ్ణీ.

అమ్మ: అయినా యింక దానికెందుకు ? నడిచి వెనక్కి తురక్కాడి దగ్గిరికి పోవడానికే యీ యెత్తు వేసింది.

కన: మనకర్మం బావుండబట్టి మనకి చావుతప్పి బయిట పడ్డాం. మనం చేసుకున్న పుణ్యం.

సచ్చి: బోగం దెయ్యాన్ని వొదుల్చుకున్నాం. జయ్ శీతా రామ్.

(తెర పడింది.)

# శివం

## నాటకంలో వచ్చే వాళ్లు



1. వెంకటేశ్వర్లుగారు — ప్లీడరు, ఛైర్మన్.
2. మహాలక్ష్మమ్మ — తల్లి.
3. సుందరమ్మ — భార్య.
4. హనుమంతరావు — బావమరిది.
5. పంతులు — కొడుకు.
6. సుశీల — కూతురు, వితంతువు.
7. శివం — సుశీల స్నేహితుడు.
8. నారాయణరావునాయుడు — కన్ట్రాక్టరు.
9. శాంతమ్మ — నాయుడు కూతురు.
10. బండివాడూ — చాకలాడూ.



# శివం

[మధ్యాహ్నం నాలుగుగంటలు. వెంకటేశ్వర్లుగారియింట్లో ముందుపెద్ద హాలు. బైటవేపు వరండాలోనించితలుపు. దానికెదురుగుంటా యింట్లోకి తలుపు. రెండోచివర వెంకటేశ్వర్లుగారి ఆఫీసుబల్లా, బీరువాలూ. బల్లమీద కాయితాలు, బీరువానిండా పుస్తకాలు. గోడలకి గరుడుడిమీద విష్ణూ, విక్టోరియా రాణీ, సరస్వతీ, యెవరోదొరా, లా కాలేజిగ్రూపూ. పూలతో అల్లిన చిలకా, పటాలు, అమృతాంజనం కాలెండరూ. పెద్ద గడియారం, బల్లకొకవేపు వెంకటేశ్వర్లుగారి పెద్దకుర్చీ, రెండోవేపు మూడు చిన్నకుర్చీలూ, వాటిపక్కన వొక కూచునేబల్లా.

యింట్లోకివెళ్లే గుమ్మంలో లోపలగా మహాలక్ష్మమ్మ కూచునివుంది. ఆమెకి అరవై యేళ్ళు. వితంతువు. నెత్తిమీద ముసుగు. ముందు గిన్నెలో పత్తిపెట్టుకుని వొత్తులు చేసుకుంటోంది, ఆగుమ్మంపక్కనే హాలులో సుందరమ్మ కూచునివుంది. ఆమెకి ముప్పైఅయిదేళ్లు. చామంచాయ. పళ్ళెత్తు. జడేసిచుట్టచుట్టింది. జుట్టు రేగింది. కొంచెముగా బట్టతల. బొత్తాంరవిక; చీర మోకాళ్ళపైకి యెగదీసి గోక్కుంటోంది, పమిట. సన్నగా, ఎగలాక్కుపోయి, మధ్యగా వేళ్ళాడుతోంది.

బల్లమీద హనుమంతరావు కూచున్నాడు, ముప్పైయేళ్లుదాటాయి. సన్నని, నల్లనివొళ్లు, మీసాలు, జుట్టూ, గొరిగించి. పలక- చెరిగిపోయిన గంధం అక్షింతలూ మొహాన. భుజంమీద అంగోస్త్రం, తొడలపైకి పీక్కుపొయ్యే గుడ్డ. వొంటికి చెమటలేదు, కాని విసురుకుంటున్నాడు. బల్లమీద కాయితాలుపెట్టుకొని రాస్తో. కుర్చీలో వెంకటేశ్వర్లుగారు కూచున్నారు. ఆయనికి నలభై యేళ్లు, పొట్టిగా కత్తిరించినతల, వెనకాల కొంచెం వుందాలేదా అన్నట్టు పిలకా, గుండ్రని లావువొళ్ళు, మొహానచుక్క, కత్తిరించిన మీసాలు, చెంగాయిపంచ, చొక్కాలేదు. వొంటినిండా చెమటబొట్లు.]

హను: బావా, యీ రోజు వాత్తేరు వెళ్లడం వుందా?

సుంద: పడేటట్టుగా లేదు.

హను: ఏం? పోయినసారి యేం హాయిగా వుంది! బావ యీ యెండలు భరించలేదు.

సుంద: నీకేం నాయినా? పోయినసారి మూడువందలయింది. యెవరికి పెట్టినట్టు!

హను: బావకో లెఖ్ఖా! ఏమూలో?

మహ: పోనీ, అబ్బాయి వొక్కడూ వెళ్ళొస్తాడు. మనమందరం యెందుకుపని లేక!

హను: నేను లేకుండా బావకేంతోస్తుంది? ఆడవాళ్ళు మీరిక్కడుండండి, వూరగాయలూ అవీ పెట్టాలి.

సుంద: మరి నీకు వుద్యోగం కావడం అదీ యేమయింది? వాత్తేరు ప్రయాణమంటున్నావు?

మహ: రెండేళ్ళమట్టి సంపాయించాడు వుద్యోగం, యిప్పుడు సంపాదించబోతాడు! నాకూ అతనికీ వుద్యోగాలే, రేపు పెళ్ళామొస్తోంది, యీనాటికి. యేంచేస్తాడో యీయనగారు?

హను: అదంతా మా బావ చూస్తానన్నాడు లెద్దూ. బావవుండగా నాకింకేం?

[రెండునిమిషాలు కూచున్నారు, మాట్లాడకుండా. వెంకటేశ్వర్లుగారు కలం కిందపెట్టి, నిట్టూర్పువిడిచి, వాళ్ళు విరుచుకున్నారు.]

వెంక: వెధవచాకిరి! జీతమా బత్యమా! యెవరికి మెప్పు, యెంతచేసినా?

హను: అట్లా అనకు బావా! అందరూ యింతమంచి ఛైర్మన్ని యెరగమనేవాళ్ళే!

వెంక: పోదూ! అంతా ముఖస్తుతి! వీళ్లసంగతి నాకు తెలీదు? యెవరురాక్కడ!

[యెవరూ పలకరు.]

చూడు, వొక్క వెధవ వుంటాడేమో! వీళ్లలో వొకణ్ణి డిస్మిసుచేస్తేగాని బుద్ధిరాదు.

హను: నీవు పనివుండమంటే, శానిటరీ యిన్స్పెక్టరు కాణ్ణించి పనివుండవలసిందేకదూ, నేను జుల్మానా వేసినా!

వెంక: యెవడికోసం? నోరుమూసుకుని. శానిటరీ యిన్స్పెక్టరయితేనేం, మానేజరయితేనేం?

హను: బలే వుద్యోగం బావా? యెట్టా సంపాదించావో గాని! యింత హోదా యెవరికీ వుండదనుకో!

వెంక: పోదూ! పాడు హోదా యెవరి క్కావాలి? వొచ్చే యెలక్షనికి స్టాండవను.

హను: అదేమిటిబావా! అట్లాఅనకు. నువ్వే ఛైర్మను కావాలి. నీఅంత చాతైనమనిషి యీ వూళ్లో కాదు జిల్లాలో లేడనుకో. నీకంటె ఎవరి కెక్కువ వోట్లొస్తాయిలే. నీమీదున్నంత గౌరవం యీ వూళ్ళో యింకెవరిమీదా లేదు.

సుంద: యిదివర కంతేరా. ఇప్పుడదంతా పోయింది. మొదట సుశీలని బడికి పంపించినప్పుడే, సకంమందికి కోపాలు వొచ్చాయి. మొన్న చెన్నపట్నంలో డాక్టరు చదవడానికి హాస్టల్లో వుంచింతరువాత, అసలే మన మొహం

చూడడం మానేశారు. వొద్దంటే విన్నారుకారు. యీయన యీసారి ఏలక్షను యేమవుతుందో యేమిటో? దానికి చదువులేకపోతే పోయిందేమిటికి?

హాను: (సుందరమ్మతో) యిప్పుడయినా ఫరవాలేదు లెద్దూ.

వెంక: (సుందరమ్మతో) యెన్నిసార్లు చెప్పాలి నీకు? వీళ్లందరూ ఆగ్రహిస్తారని, నేను సుశీలని యింటిదగ్గిర మూల కూచోపెట్టి వంటచేయిస్తానా? యీపని లేక పోతే యెవడేడిశాడు? ప్రిన్సిపల్సుండాలి, ప్రధానం. అందరి మల్లే పిరికివాణ్ణా నేనుకూడా! ఆడవాళ్ళని యెందుకు చదివించకూడదూ? ఇంగ్లీషు ఆడవాళ్ళు వొక్కొక్కళ్లు యెంతెంత చదువులు చదివి ఆడడాక్టర్లై, మన కళ్ళముందరే యెంతెంత వుపకారాలు చేస్తున్నారు! మనవాళ్ళకి సిగ్గూ, బిడియం, వుంటేకా? వాళ్ళని వెనకనించి తిట్టేది, జబ్బుచెయ్యగానే వాళ్ళకాళ్ళే పట్టుకునేదీ. మనవాళ్లే డాక్టర్లయితే, మాల నీళ్ళు గొంతుకల్లో పోశారని, జబ్బు నయంచేనుకొని, యేడవక్కర్లేదుగా! లోకం తల్లకిందులవనీ, నన్ను వూళ్ళోనుంచి తరిమెయ్యనీ, నేనుమాత్రం నేను తలుచుకుంది చేసేతీరతాను. నలుగురూ ఏమనుకుంటున్నారా అని తప్ప, యింకేమీ ఆలోచన లేదుగావును? యీ మర్యాదా, ప్రతిష్టా అనేమాటలు చూస్తేనే వొళ్ళు మండిపోతుంది.

హాను: యెదన్నా సందు దొరికితేసరి యీ మనుష్యులకి, యెట్టాసన్నా వంకలు పెట్టాలని! పిల్లని చదివించడం కూడా పాపమే.

వెంక: పెద్దదై చదువుకుంటోందంటే, దానికన్ని సుగుణాలున్నా యన్నమాటే! ఓ అంటే నా రాక, బయటికి తొంగిచూడని పతివ్రతలందరూ, గదుల్లో చేసే పనులో!

మహా: కడుపుమంట వాళ్లకి, వొకరు బాగుపడి పోతున్నారని, తమకుమల్లే ముసుగేసుకుని మూల కూచోలేదని! మాణిక్యమంటి బిడ్డ దానికేం? యెన్నడన్నా యెదురు చెప్పిందా? చదువుకూడా మానేసి, యింట్లో వుండమంటే. సరే అనలేదూ, యెంత కష్టంగావున్నా తనకి!

హను: సుశీల నన్నవాళ్ల నోట్లో పుండు పుడుతుంది.

[బయిట చెప్పుల చప్పుడు. చప్పున లేచి సుందరమ్మ లోపలికి వెళ్లింది. నారాయణరావునాయుడు వొచ్చాడు. కారు నలుపు. గుండ్రని శరీరం, కొంచెంగా బొర్ర. గిరజాలు, కొంచెం నెరిసిన మీసాలు. కిందిపెదిమ జిడ్డుగా కనపడుతోంది. నిలువుబొట్టు. షర్టూ, మల్లూ, జరీవుత్తరయ్యం, వేసుకున్నాడు. గుమ్మంలో చెప్పులు విడిచి, కర్రక్కడే పెట్టి వొచ్చాడు. వెంకటేశ్వర్లుగారికి నమస్కారం చేశారు. వెంకటేశ్వర్లుగారు తల వూయించి కుర్చీవేపు చూశారు. తన వొంటివేపు యిబ్బందిగా చూసుకుని, హనుమంతరావుకి సౌజ్ఞ చేశాడు. అతను యింట్లోకి వెళ్లాడు. నాయుడు కూచున్నాడు. హనుమంతరావు పొట్టి అఘారం తెచ్చిస్తే వెంకటేశ్వర్లుగారు వేసుకుంటున్నారు.]

నారా: మీతో వొంటరిగా కొంచెం మాట్లాడాలి.

[వెంకటేశ్వర్లుగారు హనుమంతరావు వొంకచూచారు. అతను వెళ్ళిపోయినాడు.]

నారా: మరి ఏమాలోచించారండి?

వెంక: ఆలోచించేందు కేముందండి? వాణ్ణి పిలిచి మొన్న గట్టిగా మందలించా.

నారా: మరి ఏమీ మారినట్టులేదు. యీవాళ మళ్ళీ వొచ్చాడు. మళ్ళీ రేపు మాయింటికి......

వెంక: అంతకంటె ఏం చెయ్యనండి? చిన్నవాడా చితకవాడా చెయ్యిచేసుకోడానికి? వాడికి బుద్ధివుండాలిగాని, నేనేంచెయ్యను? మీరు చెప్పండి? యింటో తాళం వెయ్యలేంగదా?

నారా: మరి నా సంగతి ఆలోచించండి. రేపు మా పిన తండ్రికొడుకూ అతనిభార్యా వొస్తున్నారా. యీప్రకారం, మీ అబ్బాయి ఘోషా యింటో చొరబడితే, నా గవురవ్వా, ప్రతిష్టా, కులం, గోడూ, నిలవాలా? ఏమన్నాళ్ళని వూరుకో నండీ?

వెంక: మీ రొక్కరేగాదు. వాడిమీద అనేకఫిర్యాదు లయినాయి. శుద్ధ రౌడీ అయినాడు. వాడిమూలంగా నాకు వూళ్లో తలెత్తుకొని తిరగడానికి సిగ్గేస్తోంది. నాకు స్వాధీన మేమాత్రమూ కాడు. యేం చెయ్యను చెప్పండి?

నారా: అట్లాఅంటే ఎట్లానండి? మీఅబ్బాయి అని...

వెంక: పోనీ. మీ రెందుకురానిస్తారు లోపలికి? నేనేమీ అనను. మా అబ్బాయి అని యేమాత్రం చూడకండి. యిట్లాంటి వాటిల్లోనా? గుమ్మంలోకొస్తే గెంటండి.

నారా: అది యీవూళ్లో యెవరి తరమూ కాదండి, ఆడజట్టూజట్టూ వొచ్చిందంటే, తిక్కిన ఆడవాళ్ళకూకూడా మాటదక్కనీరు. పోలీసువాళ్లకే భయం వాళ్లని——

వెంక: యింక నేనుమాత్రంయేం చెయ్యను? మీఅమ్మాయిని కట్టుదిట్టం చెయ్యరాదూ?

నారా: మాఅమ్మాయి మంచిదే. యెన్నడూ యెరగదు యిట్లాంటివి. ఘోషానించి బయిటికిరానిపిల్లదాని కేం తెలుసు? యెట్లా కన్నేశారోమరి! అప్పటికీ బయిటికిరాంగచూడొద్దని చెప్తూనేవ్వుంటూ. లోపల వున్నంతసేపేగాని, బయిటికొస్తే పరువేమున్నదండీ ఆడదానికి?

వెంక: అవునండి బయిటికి వొచ్చినూడా మానం నిలుపుకోడం ఆ దొరసానులకే గాని, మనవాళ్లకి చాతకాదండి. బయిటికొస్తే యేముంది? పతివ్రతలు కాదండి?

నారా: మరి మొగవాడు నిలవనిస్తేగా? మళ్లీ మీటింగుల్లో చెప్తారండి, మాతృసమానులని, లక్ష్మి అవతారాలని బయిటికొచ్చి, దేవదాసీవాళ్లమీదంతా కల్లేసండి. యిదండీ యీ దేశంలో స్త్రీల మర్యాద! ఘోషాలోనే యిట్లా చోరపడుతూవుంటే.

వెంక: మీ అమ్మాయీ వాణ్ణి పొమ్మనకూడదూ?

నారా: అనదు. ఏం మాట్లాడదు.

వెంక: ఇంక నాకు తెలీదండి. మీ యిష్టం, యేమన్నా చెయ్యండి వాణ్ణి. కాని, ఒకటీ——వూళ్లోమాత్రం అల్లరి చేస్తిరా, మీ అమ్మాయికే నష్టం. గుట్టు చప్పుగా వుంచితే మంచిది.

నారా: మీరూ యెవరితో యేమీ అనకండి.

కాని తమరు తిరిగి వొకమాటు......

వెంక: ఈవాళ గట్టిగా చివాట్లు పెడతాను.

నారా: మంచి శలవు.

[వీధులో బండిచప్పుడు]

వెంక: చిత్తం, చిత్తం.

[నాయుడుగారు వెడుతున్నారు. నడవాలోంచే సుందరమ్మ వొచ్చింది. గుమ్మంలోంచి బండివాడు ట్రంకులూ బుట్టలూ తీసుకొచ్చాడు. సుందరమ్మ లోపలికి పంపిస్తోంది.]

సుంద: ఇదేమిటి! యీ ట్రంకు అమ్మాయిదికాదే! యీ లోపీసేమిటి? ఎవరి సామానిది?

బండి: అమ్మాయిగారిదేనండి.

సుంద: సరే, లోపల పెట్టు.

[హైటు బూడ్సుల చప్పుడు. ప్రవేశం సుశీల, వెనకాల శివప్రకాశం. సుశీలకి ఇరవై రెండేళ్లు. కాని పద్దెనిమిదేళ్లదానికన్నా చిన్నదానిలాగుంది. పొట్టి, పలచన శరీరం. చక్కని నుదురూ, జుట్టూ. అందంగా ముడి వేసింది. దుర్వానలూ, సూదులూ పెట్టింది తల్లో. కళ్లకి సులోచనాలు. నగ లేమీ లేవు. ఫార్సీరకంగా చక్కని లేసువేసిన పట్టుచీరె కట్టింది. మెడ కనపడేటట్టు కత్తిరించిన జాకెట్టు. కాళ్లకి బూడ్సులు. శివం సూటు, బూటు, వేశాడు. జేబులోంచి సైతెస్కోపు కనపడుతోంది. పొడుగు, చామంచాయ. సన్నని

మీసాలు. ఉంగ్రాల క్రాపు. కొంచెం వొంగుతాడు. మెల్లిగా మాట్లాడతాడు. సుశీల ముందు సుందరమ్మకి షేకాండిచ్చి. వెంకటేశ్వర్లుగారిదగ్గరికి శివం చెయ్యి పట్టుకు తీసికెళ్లి షేకాండు యిచ్చింది. వెంకటేశ్వర్లు గారూ సుందరమ్మా తెల్లపోయి చూస్తున్నారు.]

సుశీ: ఈయన మా కాలేజీలో ఫైనలియ్యరు స్టూడెంటు. మెడిసిన్‌లో మెడలిస్టు. ఇట్లానే వెడుతోవుంటే, మనతో వారంరోజు లుండమని దింపాను, బలవంతంమీద.

వెంక: దయచెయ్యండి అట్లా.

[శివప్రకాశం కూచున్నాడు. గోడపక్కన వున్న కుర్చీ బల్లదగ్గరికి జరుపుకున్నాడు. సుశీల అతని కుర్చీ మీద చెయ్యివేసి నుంచుంది.]

శివం: తమరీవూరు ఛైర్మనుట కదూ ?

వెంక: అవును.

సుశీ: చాలా కొత్తసంగతులున్నాయినాన్నా, శివంతల్లో. శానిటేషన్, ఎపిడిమిక్సు వీటినిగురించి, మీరు నేర్చుకోవాలవన్నీ. చాలా పనికివొస్తాయి.

[శివం, జేబుల్లో వెతుక్కొని వుత్తసిగరెట్టుపెట్టెతీసి, చూసి కింద పారేశాడు]

సుశీ: సిగరెట్లు లేవా ?

శివం: అయిపోయినాయి. ఆఖరిది నువ్వే తీసుకొన్నావు యిందాక.

సుశీ: పెట్టెలోవున్నాయిగా తాళంచెవులు. ఇయ్యి. తీసుకొస్తాను.

శివం: అవసరం లేదులెద్దూ.

[సుశీల కుర్చీ వెనకాలకెళ్ళి తాళం చెవులకోసం, శివం మీద వొంగి, కోటు జేబులు తడుముతోంది. తాళం చెవులు తీసుకొని లోపలికి పరుగెత్తుతోంది.]

శివం: మెడికల్ డిపార్టుమెంటులో స్మోక్ చెయ్యకపోతే వీలు లేదండి.

వెంక: అట్లానేం?

సుంద: స్మోక్ ఏమిటండీ?

వెంక: ఏదో లెద్దూ, నీకెందుకు వూరుకో.

(శివంతో) మీ రెవరండీ బ్రాహ్మలేనా?

శివం: ఇంక డాక్టరయింతరవాత అవన్నీ యేమిటండీ? అంతా వొకటే. కత్తిపెట్టికోస్తే, లోపల అందరికీ ఒకటే కనపడుతుంది. బ్రాహ్మడికి నెత్తురు యెక్కువ యెర్రగా వుంటుందనుకున్నారా, పూలాడి దానికంటె!

వెంక: మేము డాక్టర్లము కాముగా మఱి?

శివం: ఎవరయితేనేం? మళ్ళీ చదువుకున్నామంటారు. మీరు గొప్పబ్రాహ్మలు. ఎన్నడూ మాంసము తినరు. మీరు రేపు చచ్చిపోయింతరవాత..

సుంద: ఛా, ఛా,! అదేమిటి అట్లా అనకూడదు......

శివం: ఏం? చచ్చిపోరండీ, యీయన? యిప్పుడు ప్రస్నే తాసినుయిస్తే యింకొంచెంసేపటి కేముండదు.

సుంద: ఏమిటండీ యీ అప్రాచకం?

వెంక: నీకెందుకు వూరుకో.

శివం: ఏమంటున్నా? అవును. కోస్తామనుకోండి. మాంసం

తినకపోతేమాత్రం, లోపల అన్నీ వంకాయలుంటాయను కున్నారా? గారెలుంటాయా? మాంసంతిన్నా, కూరగాయలుతిన్నా అంతా మాంసమే! ఇదంతా తెలివి తక్కువగాని యింకేంలేదు.

వెంక: పోనీ మాది తెలివితక్కువేగాని......

శివం: ఎందుకు? భోజనం విషయమేనా! మీ మురికి వంటింట్లో ఆ జెర్మ్సులో పెట్టడంకంటె, యీ బల్లమీద పెడితే చాలా సంతోషిస్తా. లేకపోతే, రిఫ్రెష్మెంటు రూముకుపోతా: మీకేం యిబ్బంది చెయ్యను లెండి.

[సుశీలవొచ్చి, సిగరెట్టుపెట్టె శివంచేతికిచ్చింది. శివం వెలిగించుకున్నాడు. సుశీలకొటిచ్చాడు. వొద్దంది.]

శివం: కొంచెం బయటికి వెళ్ళివొస్తా. సాయింత్రమైంది.

సుశీ: నేను వొస్తాను. చాలామంచి చెరవుంది ఈ వూళ్లో. నువ్వు చూసితీరాలి. ముందు ఆబట్టలిప్పేసి, మొహాం కడుక్కోవూ? ఇట్లారా లోపలికి!

సుంద: అమ్మాయీ, నువ్వెక్కడికే.

సుశీ: షికారెళ్లొస్తా.

సుంద: మళ్ళీ యెప్పుడొస్తావు?

సుశీ: మీఇంట్లోఎనిమిదిన్నరకిగాభోజనం. అప్పటికొస్తాలే.

[లోపలికి వెళ్ళిపోతున్నారు. సుందరమ్మా వేంకటేశ్వర్లూ ఒకరిమొహం ఒకరు తెల్లబోయి చూసుకుంటున్నారు.]

వెంక: ఏమిటిది?

సుంద: ఇదేమిటి?

వెంక: సుశీలేనా?

సుంద: చెపితే విన్నారూ?

వెంక: వాడెవడు?

సుంద: ఏమో!

వెంక: ఇంటో యేమన్నాగానీ వీళ్ళని బయటికి వెళ్ళనీ కూడదు. అరగంటలో వూరంతా మోగిపోతుంది.

సుంద: అప్రసవ్రను. మరియెట్లా?

వెంక: చెప్పు, దాంతో.

సుంద: చెపితే వినపడుతుందా?

వెంక: ఇవతలికి పిలిచి గట్టిగా చెప్పు.

సుంద: నాకు తెలీదు, మీరే చెప్పండి.

వెంక: నేను పిలుస్తున్నానని రమ్మను.

సుంద: వాడుకూడా వొస్తాడు.

వెంక: వొస్తేనేం? భయమూ, రమ్మను—అట్లా కాదు. వొక్కత్తెనే రమ్మన్నానని చెప్పు.

సుంద: వాడిముందే?

వెంక: ఆ. పో.

[సుందరమ్మ వెడుతోంది. వెంకటేశ్వర్లు ఆలోచిస్తో కూచున్నాడు. చీకటవుతోంది. చాకలి దీపాలు వెలిగించి బల్లమీద వొక పెద్ద టేబిలులైటూ, గుమ్మం చివర పెద్ద హాంగింగులైటూ పెట్టి వెళ్ళాడు. ఐదు నిమషాల తరవాత సుశీలా, సుందరమ్మా వొచ్చారు. సుశీల జుట్టు దువ్వుకుని, మొహం కడుక్కుని, మొహాన పౌడరేసి వొచ్చింది. వెంకటేశ్వర్లుగారు,

కోపంగా ఆశ్చర్యంగా, సుశీలకేసి, కళ్లువిప్పి, రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు. తన చూపుల్తో సుశీల నొక్కుతుందనుకున్నాడు. సుశీల నిర్భయంగా చిరునవ్వుతో వొచ్చి నుంచుంది. ఒకనిముషం చూసి, వెంకటేశ్వర్లు మాట్లాడకుండా అట్లానే చూస్తో వుంటే, అక్కడ బల్లమీద లాపుస్తక మొకటి తీసి చూస్తోంది.]

సుశీ: ఈ క్రిమినల్‌కోడు కొంత శివానికిసూడా తెలుసు. డాక్టర్లు చదవాలి.

(కొంచెంసే పూరుకుంది.)

సుశీ: కానీండి. వెళ్ళాలి.

వెంక: ఏమిటిది?

సుశీ: ఏది?

వెంక: ముందు వాడెవడు చెప్పు.

సుశీ: ఎవరు?

వెంక: చాల్లే నోరుముయ్యి. నీతో వొచ్చినవాడు?

సుశీ: బండీవాడా.

సుంద: శక్తా, శివమా, ఎవడో.

సుశీ: (బిగ్గిరిగా నవ్వి) శివప్రకాశమా. సరే. ఏం అతను?

సుంద: వాడెందుకొచ్చాడూ?

సుశీ: నేను రమ్మంటే—

సుంద: ఎందుకు రమ్మన్నావు?

సుశీ: ఎందుకు రమ్మంటారు స్నేహితుల్ని? మీ స్నేహితుడు ఆ జగన్నాథంపంతులు యెందుకొచ్చాడిక్కడికి, పండక్కి? అట్లానే!

వెంక: ఎవరు తీసుకురమ్మన్నారు నిన్ను?

సుశీ: ఇంతకీ అతను వొద్దంటారా యింట్లో?

వెంక: ఇంకా అడుగుతావేం చెల్లిగా? ఎవడో కిరస్తానీ వెధవని యింట్లోకి తీసుకొచ్చి......

సుశీ: (మెల్లిగా;) మొన్న శెలవలికి మీరు తీసుకొచ్చి పలహారంపెట్టిన డేనియల్‌గారు విన్నారంటే కిరస్తానీ వెధవనడం, మీకు వోటియ్యరు.

వెంక: వీడు అంతకంటె అధముడు. వాడికోమతం, నీతన్నా యేడిసింది.

సుశీ: ఇతడు బ్రాహ్మడే, జంధ్యంకూడా వేసుకుంటూన్నాడు. పోనీండి. మీకిష్టంలాకపోతే, ట్రావెలర్సు బంగాళాలో వుంటాండులెండి, యీ రెండురోజులూ?

వెంక: ఏ రెండురోజులూ?

సుశీ: అతనికి నేను వూరంతా చూపించిందాకా.

వెంక: నువ్వు చూపించడమెందుకు? తను వెళ్ళలేడూ?

సుశీ: నేనుకూడా తనతోవుండి చూపిస్తానంటేనే వొచ్చాడు. మాటిచ్చింతరువాత యిప్పుడు డిజప్పాయింటు చేస్తే బావుంటుందా? మా కాలేజీలో నాకు మళ్ళీ మొహం చెల్లేలా?

వెంక: ఏడిసినట్లేవుంది. నీకసలు యీ మొగాడితో స్నేహ మేమిటి?

సుశీ: మీకూ పాలుదొరసానికీ స్నేహంకాదూ? అమ్మకీ ధర్మారావుగారికీ స్నేహంకాదూ ?

సుంద: స్నేహమేమిటి? దూరన్నించి మొగాడితో మాట్లాడితే స్నేహమేనా ?

వెంక: మీదపడి జేబులు వెతుకుతారా, స్నేహమయితే......అందులో సిగరెట్లకోసం... కాల్చావా నువ్వు కూడా ఒకసారన్నా.

సుశీ: ఎప్పుడూ కాలుస్తా. ఇందాక తలనొప్పిగావుండి వొద్దన్నా.

వెంక: ఓసీ, ఓసీ- యెంతదానవయినావే! ఆడదానికి సిగరెట్లేమిటే ?

సుశీ: సిరిపురం అమ్మమ్మ నల్లమం చేసుకుంటుంది. దాన్ని యెవరూ యేమనరు. మెడికలుగా నల్లమందుకంటె సిగరెట్లు చాలనయం- వెయ్యిరెట్లు.

వెంక: నీకింక జవాబు చెప్పేదేమిటి? వాడిమీ దెందుకట్లా పడతావు?

సుశీ: తప్పా!

సుంద: తప్పా! తప్పా! గరిటె కాలేసి.........

సుశీ: ఉండుండు. చిన్నదాన్ని పదేళ్ళదాన్ని, ఆ నలభై యేళ్లవాడితో మొగుడని ఆవేళ మధ్యాహ్నం గొళ్ళెం వేశారే, అరిచినా, యేడ్చినా తియ్యకండా......... ఆచేతులు వెయ్యడం మంచిదిన్నీ, యితన్ని వూరికే కోటు ముట్టుకుంటే తప్పూనా? అసలు చచ్చాడుగాని, వాణ్ణి మిమ్మన్నీ ప్రాసిక్యూట్ చెయ్యొచ్చుట, శివం చెప్పాడు.

ఇప్పుడన్నా చచ్చాడుకాదు. ఇంట్లో తీరిగ్గా డిశ్కషన్ చేసుకుందును.

సుంద: శివ, శివా!

(శివం వొస్తున్నాడు)

శివం: నన్నా?

[వెంకటేశ్వర్లుగారు కోపంతో శివాన్ని ఏదో అన పోతో వుంటే, యింతలో బయట బూట్సులచప్పుడు. సుందరమ్మ లోపలికి పోతో, సుశీల చెయ్యిపట్టుకు లాగుతుంది. సుశీల చెయ్యి వొదిలించుకుని చదువుకుం టోంది. సుందరమ్మ వెళ్ళిపోయింది. నారాయణరావు నాయుడు వొచ్చాడు. మళ్ళీ కర్చీలోకూచున్నాడు.]

సుశీ: (తలెత్తి) శివం, మనం వెడదామా?

వెంక: అమ్మాయీ! మాట. వుండు.

సుశీ: ఆనికవొచ్చి కనపడతా. శివం! రా.

[ఇద్దరూ వాకిటి వేపు నడుస్తున్నారు. వెంకటేశ్వర్లు గారు లేచి త్వరగా గుమ్మం దగ్గిరికి వెళ్లి] ......

వెంక: అమ్మా! సుశీలా! కొంచెంవుండు. ఆయన్ని పంపించి.

సుశీ: అక్కర్లా. త్వరగా వొస్తా.

వెంక: నామాటవిని వుండవూ?

వెంక: (సుశీలనీ, శివాన్నీ, చెయిపట్టుకు తీసికెళ్ళి కూచోపెట్టి) సుశీల నెరగరండీ.

నారా: సుశీలమ్మేనా! యెంత మారిపోయింది. ఎవరో ఎవతో క్రిస్టియ......చాల మారిపోయినారు. అప్పారిసీళ్లు

కొత్తచేశారో యేమిటో ?

వెంక: ఈయన మా అమ్మాయి కాలేజీలో ప్రొఫెసరు. చాలా గొప్ప డాక్టరు. మా బంధువులే. యిక్కణ్ణో డాక్టరుగారితో పరిచయం.

శివం: నేను చదువుకుంటున్నా యింకా, సుశీలనుగివుని ప్రాణంతీస్తే దిగాను, యీనవారి డాక్టరెవరో తెలీసునాకు. నేనట్లా చెప్పలేదే !

వెంక: (నాయుడితో) మీపనికానీండి. మనవారే. ఫరవాలేదు.

నారా: మా అమ్మాయిని లేపతీసుకుపోయినారు. యేం చెయ్యానండి ? యింకేం చెయ్యానండి ?

వెంక: నిజమే ! నిజమే ! యెప్పుడు ?

నారా: అంతా నిజమే ! గంటయింది. నేనింటి కెళ్లే టప్పటికి పిల్ల లేదు. యిట్లాంటిదేదో అవుతుందని నే నను కొంటోనేవున్నా.

వెంక: నాకింకా నమ్మకం లేకుండావుంది, పంతులే ! ఏమో బాగా చూడండి, అంతపని చేస్తాడా వాడు ? వాడి కంత ధైర్యం లేదే !

నారా: యేమీ సందేహం లేదండి.

వెంక: నా ఖర్మం యట్లా కాలిందండి. మీ రిక్కడి కొస్తే యేంలాభం ? నేనేం చెయ్యను ?

నారా: మరి యింకెక్కడికి పోనండి ? యేం చెయ్యాను? యిట్లాంటి గర్భశోక మొచ్చింది.

వెంక: నాకూ అట్లావుంది. మావాడు చేస్తే నాకొచ్చి

నట్లు కాదండీ! యెంత అపకీ_ర్తి! లోకుల నోళ్ళెట్లా కడతాము? నా పేరు యెందుకన్నా పనికొస్తుందా? యెందుకండీ కొడుకులు పుట్టి?

నారా: నాగతి! నాగతి! నా బంధువుల్లో యింక నాకు మర్యాదేముంది? ఆడపిల్ల లేచిపోయింతరవాత వెయ్యి జన్మాలె_త్తినా ఆ యింటికి గౌరవం వుంటుందా? యింక మొహంమీద ముసుకేసుకు నడవ వలసిందే!

శివం: ఎక్స్యూజ్ మి. మీ యిద్దరిలో వొక్కరూ పాపం ఆ అమ్మాయి సంగతి ఆలోచించరేం? మీ యిద్దరికంటే కూడా కష్టపడేది ఆబిడ్డ......

సుశీ: నాన్నన్నా. కష్టపడవలసిందే, లేచిపోయిందానికి సౌఖ్యంకూడానా?

(శివం సుశీలవైపు తెల్లపోయి చూస్తున్నాడు.)

వెంక: (నాయుడితో) వాడింకా ఇంటికిరాలేదు. రాగానే కనుక్కుంటాను. వాడికోసం కబురు పంపుతాను.

నారా: యెట్లానన్నా నలుగురికీ తెలీకండా, మళ్ళీ యీ రాత్రే దాన్ని మాయింటో దిగపెట్టే మార్గం చూడాలి.

(వెళుతున్నాడు.)

వెంక: చూశావా, మీ అన్నయ్య ప్రవ_ర్తన? యిప్పుడు నువ్వు మొదలు పెట్టావు.

(సుందరమ్మ తలుపు తీసుకొచ్చింది.)

విన్నావా? నీ సుపుత్రు డేంచేశాడో?

సుంద: వింటూనే వున్నా. ఆయన మాట్లాడితే ముందు మనదగ్గరి కెందుకొస్తాడు?

వెంక: ఏం చేస్తావు మరి?

సుంద: ఏం చెయ్యలేకపోతే వూరేసుకోమనండి. ఇక్కడికొచ్చి గోలెందుకు?

వెంక: ఇంకా మంచివాడుగనుక సరిపోయింది. లేకపోతేనా!

సుంద: ఏంచేస్తాడేం? ఇలాంటివాళ్ళని యెంతో మందిని చూశాడు వాడు. వీడో లెక్కా?

వెంక: అవును. అన్నిటికీ తెగించినవాడికి—

సుంద: వీడికి అమ్మాయి తెగించింది. మున్నుదన్నా సంసార్ల జోలికి వెళ్ళాడా వాడు. యీనాళ్ళని నాయుడుకు ఇంతలోకే కావలిసి వొచ్చింది గావును వాడికి? వాణ్ణి వెతుక్కుంటూ ఆవాళ వొచ్చిన సానిదాన్ని చూశారుగా? మీ రెవరో అని కుర్చీ యిచ్చారుకూడా! దాని అందం మండా—

వెంక: ఛీ! ఛీ! ఇంకా సిగ్గులేక, వాణ్ణి వెనకేసుకొస్తావు!

(హనుమంతరావు వొచ్చాడు.)

హను: విన్నారా సంగతి?

వెంక: ఆ, యెక్కడున్నాడా వెధవ?

హను: ఏమో! నాయుళ్ళందరూ పోగై యివాళ పంతుల్ని చంపుతాం, లేకపోతే చస్తామంటున్నారు.

సుంద: ఏడిశారు. వాణ్ణేం చేస్తారు? వాడు ఈల వేశాడంటే—

వెంక: సరేలే, వూరుకో! అపరిదిష్ట!

హను: మీరు మెత్తగా వూరుకోడం కారణం దీనికంతా?

వెంక: అందరికీ తెలిసిందీ? యింక నాకు పరువేమిటి? యేంచెయ్యను? యేడీ వాడు?

హను: యీ పాటికి వూరు దాటివుంటారు. యింట్లో

డబ్బు పోయిందేమో చూసుకోండి.

(మహాలక్ష్మమ్మవొచ్చి వెనకాల నుంచుంది.)

వెంక: యిద్దరినీ పట్టుకుని పీపు బద్దలయ్యేట్టు......

మహా: పాపం, ఆ అమ్మాయి గతి......

సుంద: దానికేం? దానికి కావలసినవాడు దొరికాడుగా! వొళ్లో వేసుకుంది, ఇంక వొదులుతుందా? మొగాడు మహా రాజు, యిష్టమొచ్చినట్లు తిరుగుతాడు. ఆడదాని కంత మాత్రం వొళ్లు తెలియక్కర్లేదూ! వాడికెంత అపరిదిష్ట తెచ్చిపెట్టిందో చూడు. దానిక్కావలసిందే శాస్తి.

[పంతులు వొచ్చాడు. యిరవై యేళ్లు. లావు,పొడుగు. చక్కనిరంగు వొళ్లు. పంచ, పక్కగుండీల చొక్కా, బుజంమీద మడిచిన వుత్తరియ్యం, చేతిలో లావాటి కర్ర, బుగ్గన తాంబూలం.]

పంతు: (చిరునవ్వుతో) ఏమిటో అడావిడి పడుతున్నారు? (సుశీలను చూచి) యిదుగో డాక్టరుగారు!

[సుశీల మొహం అటుతిప్పి మాట్లాడదు. ఎవరూ అతనితో మాట్లాడ లేదు. పంతులు అందరి మొహా లూ చూస్తున్నాడు.]

పంతు: ఇట్లావున్నా రేమిటి? యింట్లో యెవరో పోయినట్లు?

(ఎవరూ మాట్లాడరు.)

శివం: నేను చెప్పనా?

[పంతులు తెల్లపోయి శివంవొంక చూస్తున్నాడు. హనుమంతరావు యికిలించి నవ్వుతున్నాడు]

శివం: నేను మిస్ సుశీల ఫ్రెండుని. మీ రేగావును

యెవరో అమ్మాయిని లేవ తేసుకు పోయినారటకదూ! అంటు కనుకుంటూ, వీరు మాట్లాడండి.

పంతు: అమ్మాయిని లేవ తీసుకుని? యే అమ్మాయిని?

శివం: ఏమో అడగండి. ఆ బాబ్రు బాబు కూతుర్ని గావును.

హను: యేం తెలీనట్లే యెట్లాచూస్తావో చూడండి. వూరంతా మోగిపోతోంది. యీయనికిమాత్రం యేం తెలీదుట?

పంతు: (హనుమంతరావుతో) అట్లా చాటుమాటుగా అనకపోతే, యేదో చప్పున యీడవరాదూ?

హను: నాయనా, ఆనారాయణరావు కూతుర్ని తీసికెళ్లావని నువ్వు, యిప్పుడే చెప్పిపోయినాడు. పాపం.

పంతు: ఛా! నాకేం తెలీదే? యేమయింది? ఆ అమ్మాయి యింటో లేదూ?

హను. యేం అయాయకత్వం? యేమీ తెలీదు బాబుకి! దొంగ వేషాలు.

వెంక: (చాలా దూకుడుగా పంతులుమీదికొచ్చి) తెలీదూ, తెలీదూ? నీకు తెలీకపోతే యెవరికి తెలుస్తుంది? యెక్కడ పుట్టావురానాకు! ఎందుకు యిట్లా యేడిపిస్తావంట నన్ను! పోరాదూ యెక్కడికన్నా, పీడవొదిలిపోతుంది? యెన్ని అని సహించడం?నన్ను తలెత్తుకు తిరగనిస్తావా లేదా?

పంతు: యెందుకు నన్నిట్లా తిడతారు! నాకేం తెలీదు. యేం ప్రమాణం చెయ్యమంటె అది చేస్తా. నాకేం తెలీదు.

వెంక: అబద్ధాలు చెప్తావంటే వొళ్ళు మండుతుంది. పైగా తెలీదుట! నీకు తెలీకపోతే ఆ అమ్మాయి యేమ

యింది?

పంతు: ఏమో!

హను: యేమోట! యేం తెలీదు! యిప్పుడే పుట్టినపాప!

వెంక: అసలు ఆ అమ్మాయిజోలి నీకెందుకు? యెందుకు వాళ్ళింటికెళ్ళావు?

పంతు: ఆసంగతి మీకెందుకు? అది నా బిజినెస్.

హను: చాలా గొప్పబిజినెస్.

వెంక: నాకెందుకా? నాకెందుకా? వూరంతా మోగి పోతూ వుంటే నాకెందుకా?

పంతు: మీరెత్తుకుపోలేదుగా ఆ అమ్మాయిని! మీకేం?

వెంక: అపరిదిష్ట యెవరికి? ఆ నారాయణరావునాయుడు యెవరింటికొచ్చాడు యిప్పుడు? నీకో పరు వేడిస్తేగా, తగల పడ్డానికి?

శివం: యింతకీ మీకు విచారమల్లా మీప్రతిష్ట పోతుందని!

వెంక: యిం కింతకంటె యేంకావాలి? (హనుమంత రావుతో) నారాయణరావు నాయుణ్ణి పిలుచుకురా. యిదేదో కనుక్కుందాము.

హను: (వెడుతో) యింకా యీయనికి అనుమానమే!

(వెళ్ళాడు.)

మహా: పంతులూ; నాయనా, నువ్వింకా యీదుర్మార్గం పనులు మానెయ్యవురా!

వెంక: వాడిమొహం వాడు మానేదేమిటి!

సుంద: నీసానులూ నువ్వున్నన్నాళ్లు మే మేమన్నా. అన్నామా! యిట్లా సంసార్లజోలికెడితే వాళ్ళూరుకుంటారా

అబ్బాయ్!

వెంక: అందులో నారాయణరావునాయుడు. ఆవార్త వార్తంతా అత నెట్లాచెపితే అట్లా వింటుంది. పెంచి పెద్దవాణ్ణి చేసి నందుకు, యీ ప్రబుద్ధుడు చేసే వుపకారం యిది.

శివం: పిల్లల్ని యెవరికోసం పెంచుతారు లెండి!

వెంక: యెందుకు పెంచాలండీ!

శివం: వాళ్ళని యెందుకు లోకంలోకి రప్పించాలండీ? రప్పించిన వాళ్ళని పెంచడం, మీ డ్యూటీకాదండీ?

వెంక: మా కడుపున పుట్టకపోతే, మాకు అపరిదిష్ట వుండదని, యింత గొప్పఆయన్ని బొట్టూ కాటికా పెట్టి పిలిచామూ! మేం రప్పించే దేమిటండి?

శివం: కాదు మరీ? (సుందరమ్మతో) యీయన కాదండీ?

(సుందరమ్మ సిగ్గుపడి తల తిప్పేశింది)

వెంక: అయితే పిల్లలు పాడితే యిట్లా మమ్మన్నేడి పించాలా?

శివం: ఆయన్ని అట్లా యెందుకు పెంచారు?

వెంక: మేం పెంచే దేమిటి? అట్లా తయారయినాడు.

శివం: తల్లీ తండ్రిలోలేని బుద్ధులు పిల్లలికి రానేరావు. మీాముక్కు పొట్టయితే, అతనికీ వొస్తుంది. పొట్టిముక్కా అని అతనితో పోట్లాడి యేంలాభం? మీాగుణాలే అతని కొచ్చాయి. లేకపోతే ఆమెవో. మీారు మర్యాదస్తులూ, ధైర్యనయినారుగాని, యీమర్యాదపోతుందని భయమేలేక పోతే, నలుగురూ, మిమ్మల్ని హీనంగా అనుకుంటారనే నిశ్చయమే లేకపోతే మీారూ అట్లానేవుండేవారు.

వెంక: యింక మీరు వూరుకోండి, చాలు.

సుశీ: కాదు నాన్నా! శివం మెడికల్‌గా మాట్లాడు తున్నాడు. నీకేం తెలీదు.

వెంక: యిదీ చివరికి పిల్లలనే మాటలు!

మహా: నిజమేరా, ఆయన అనేది. నీచిన్నతనం జ్ఞాపకం తెచ్చుకో.

వెంక: మానాయన ప్రతిష్ట పాడుచేశానా?

మహా: రహస్యంగా, దొంగతనంగా చేసేవాడివి,పంతులు బహిరంగంగా చేస్తున్నాడు. పంతుల్ని చూస్తే, చిన్నప్పుడు నువ్వు చాలాసార్లు జ్ఞాపకం వొస్తావు. జ్ఞాపకముందీ ఆ మెంతులవారి కోడల్ని—

వెంక: చాల్లెద్దూ.

[వీధితలుపు అవతల్నించి కాంతమ్మ మెల్లిగా సన్నని గొంతుకతో "పంతులుగారున్నారండీ" అని పిలి చింది. యెవరూ మాట్లాడరు. అందరూ తెల్లబోయి నారు– పంతులు కొంచెం భయంకూడా పడ్డాడు. మళ్ళీ పిలిచింది. ఎవరూ పలకరు.]

శివం: వున్నాడమ్మా. యిప్పుడే వచ్చాడు.

కాంత: వొకసారి యిట్లారమ్మనరూ!

శివం: ఆమె మీకోసం వొచ్చిందిటండీ.

పంతు: మధ్య యెవరో మీ కెందుకండీ.

శివం: ఆయన వొచ్చేటట్టు లేరండీ. యిక్కడున్నారు. యిట్లా లోపలికిరండి.

కాంత: పంతులుగారూ, మీకోసం సాయింత్రంన్నించి

వెతుకుతున్నా. అవసరం, ఒకమాట మాట్లాడాలి, రారూ?

పంతు: యిక్కడికెందుకొచ్చావు? యింటికెళ్ళు. వొచ్చి మాట్లాడతా. యిక్కడా?

కాంత: వొక్కసారి విని పొండి. నాకోసం రారూ?

పంతు: ముందు వెళ్లు.

మహ: వెళ్ళతా, యెందుకో పాపం ఆ అమ్మాయి వొ స్తే!

వెంక: వెళ్లు.

[పంతులు కదలడు. శివం లేచి వెళ్లి కాంతమ్మ చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకొచ్చాడు. సన్నగా పొడుగ్గా వుంటుంది. నడుము వూగులాడుతోంది, నలుపు, చాలా పెద్దకళ్లు. వీళ్ళందరినీ చూసి అదిరిపోతున్నాయి. మొహంలో సిగ్గు, తెల్లచీరె, జాకెట్టు, మురుగులూ, మెళ్లో బంగారు గొలుసూ, కాళ్ళకి వెండి పట్టాగొలుసులూ. తల వెనకాలకి బాగా దువ్వినముడి]

[మళ్ళీ చెప్పుల చప్పుడు. హనుమంతరావూ, నారాయణ రావునాయుడూ వొచ్చారు. సుందరమ్మ యింట్లోకి పోయింది.]

నారా: యెక్కడన్నా కనపడ్డారండీ? — యిదుగో! వొసీ, సిగ్గులేనిముండా కనపడ్డావూ? కనపడి బతుకుతావూ? బతుకుతావూ! (కాంతమ్మను కర్రతో బాత్తున్నాడు)

కాంత: అమ్మో! బాబో! బాబో!

[శివం, మహాలక్షుమ్మా, అడ్డం వెళ్ళారు. వాళ్ళకీ దెబ్బలు తగిలాయి. శివం నారాయణరావునాయుడు బొర్రమీద తన్ని పడేశాడు.]

నారా: (లేచి) నువ్వెవరయ్యా? ఎవరయ్యా నువ్వు?

శివం: నీకేం బుద్ధిలేదు?

నారా: నాపిల్లని నేను కొట్టుకుంటే నీకేం?

శివం: తరవాత నేను కట్లు కట్టక్కర్లా! నేను దూదీ లింటూ ప్రయాణాల్లో కూడా మోసుకు తిరుగుతానను కున్నారా?

నారా: ఏమిటిది? పో; అవతలికి ఎ...ఎదీ అది? ఎదీ ఆముండ?

శివం: కొట్టు, చెపుతాను. ఏమిటిది, 'బార్ బారిక్ ఏజ్' అనుకుంటున్నారా యేం? పశువులు కుమ్ముకునేది మనుషులు కాదు.

నారా: నీకెందుకంట మధ్య?

శివం: పశువులు మనుషులుండేచోటికి రాకూడదు. వెము కలు విరిగితే?

మహా: ఆడపిల్ల అయిందిగనక, చిన్నదిగనక, కొట్టారు. నోరులేదు. ఎవరూ వినరు. మొగకుర్రాడయితే బలమున్న వాణ్ణిట్లా కొట్టగలవయ్యా? బిడ్డైతేమాత్రం చంపుకుంటారా?

శివం: (పంతుల్నిచూసి) ఈయన వొంటిమీదిక చెయ్యి వెయ్యి తెలుస్తుంది. నీకర్రా నువ్వూ యేమవుతారో! 'కవ్వర్డ్' ఆడపిల్లని కొడుతున్నాడు!

నారా: అదిచేసిన పనీ......

శివం: ఆ అమ్మాయి మనిషి చేసేపని చేసింది. నువ్వు పశువు చేసేపని చేస్తున్నావు. ఇట్లాంటి పశువు యింట్లోంచి

ఆ అమ్మాయి వొచ్చేస్తే తప్పా! చాలా సంతోషంగా వుంది.

(కాంతమ్మకి 'షేకాండు' యిచ్చాడు.)

వెంక: నాయుడుగారూ, యిక్కడ యీ అల్లరంతా వొద్దండీ. మీ అమ్మాయిని మీరు తీసుకువెళ్ళండి ముందు. తరవాత సంగతి చూద్దాము.

శివం: వీల్లేదు. ఆయన తీసుకెళ్ళడానికి వీల్లేదు. ఈరాత్రి చంపేస్తాడు.

(హనుమంతరావు నవ్వుతున్నాడు.)

వెంక: చంపేసుకోనీ, య్యాగమన్నా చేసుకోనీ నీకూ ఎందుకయ్యా!

శివం: నాకెందుకా! డాక్టర్ని నాకెందుకా? వీల్లేదు. తీసుకెళ్ళమను, చెపుతాను.

నారా: నువ్వేమిటి చేసేది?

కాంత: నేను వెళ్ళను, ఇక్కణ్ణించి కదలను.

శివం: అదీ, అదీ, (షేకాండిస్తున్నాడు.)

నారా: (పంతుల్ని చూపి) ఈయన ఇక్కడుండగా అది ఎక్కడ కదులుతుంది?

వెంక: ఇతను కాదుటండీ మీ అమ్మాయిని తీసుకొచ్చింది.

నారా: ఇంకెవరు? అనమనండి. ఆయన్ని ఆ సంగతి......

పంతు: నేనేమెరగను. నేను తీసుకురాలేదు, కాంతమ్మనే అడగండి.

హను: అన్నీ అబద్ధాలు. దొంగవేషం.

నారా: యేమే! మాట్లాడు.

కాంత: ఆయన రమ్మనలేదు. నాలుగు రోజుల కిందట

మాత్రం నాకేమన్నా కష్టంగావుంటే తను కాపాడతా నన్నారు,

నారా: నీకు పుట్టిన పాడుబుద్ధే: ఎంతటిదానవైనావే! వంశం నాశనం చెయ్యడానికి పుట్టావు పాడుముండా.

మహా: అయితే ఎందుకొచ్చావమ్మా?

కాంత: (వెక్కి వెక్కి ఏడుస్తో) పంతులుగారితో మాట్లాడుతున్నానని, ఈ సాయంత్రం గదిలో పెట్టి కొట్టాడు మానాన్న. చచ్చిపోయినా ననుకొన్నా. ఈసారి పంతు లొచ్చినప్పుడు మాట్లాడితే గొంతు పిసుకుతానన్నాడు. మాట్లాడకపోతే ఆయన చంపుతామన్నారు. భయమేసి వొచ్చేశా, పంతులుగారి దగ్గిరుందామని.

శివం: 'టిరనీ, టిరనీ,' పిల్లల్ని తండ్రులు పెట్టేటంత బాధ లోకంలో కటికవాళ్ళుకూడా మృగాలని పెట్టరు. పిల్లలమీద ప్రేమట!

వెంక: పిల్లలు తండ్రుల్నో?

శివం: యేం బాధపెడతారు?

వెంక: యేమిటూ, చూడండి. నాయుడుగారు రేపణ్ణించి ఎట్లా తలెత్తుకు తిరుగుతాడు?

శివం: ఈ బిడ్డ వొచ్చేస్తే యీయన కెందుకు సిగ్గు?

వెంక: ఆయన కూతురు గనక.

శివం: ఇప్పుడింతకీ తలెత్తిపట్టేందుకాపిల్లలు? ఆయనతల వొంగుతుందేమోనని కర్రపెట్టి యిట్లా కొడుతోవుంటే. —

నారా: పిల్ల సద్దుమీరి పరాయి వాడితో మాట్లాడుతూ వుంటే, వూరుకుంటారా?

కాంత: మూడు నెల్లూరుకున్నారు. పంతులుగారు రహస్యంగా వొచ్చినన్నాళ్లూ నాయనకి ఏవో కావలసిన కాయితాలు తెచ్చినన్నాళ్లూ నవ్వుతో ఏదో చిన్నపిల్లలని ప్రారకున్నారు. మా చిన్నానకొడుకు వొస్తానని ఉత్తరం వ్రాసిం తరవాత వొద్దని పోట్లాడుతున్నారు.

శివం: యిన్నాళ్లూ తప్పుకానిది, ఒక్కరోజులో యిప్పుడు తప్పుయిందికదూ?

నారా: అవునండి. మరి నలుగురూ యేమంటారు?

శివం: సరే తెలిసింది, లెండి.

వెంక: చాలు. ఆలిశ్య మెందుకు? నాయుడుగారూ, మీ అమ్మాయిని మీరు తీసుకెళ్ళండి. ఇంతటితోనైనా ఈ అల్లరాగుతుంది.

నారా: నేనేం చేసుకోనండీ?

వెంక: ఏంచేసుకోనే దేమిటి? ఏదో దెబ్బలు తిన్నరోషం మీద...

శివం: బాధపడలేక......

వెంక: ఏదో తెలీక ఆ అమ్మాయి బయటికొస్తే, కన్న బిడ్డని వొదులుకుంటారయ్యా?

నారా: వొదులుకోక......

వెంక: అయితే, మాయింటో యెందు కిదంతా?

నారా: యింకెవరింటో. (పంతుల్ని చూపి) ఇదుగో. ఆయన యిక్కడున్నప్పుడు......

వెంక: ఇప్పుడు ఆయనమాత్రం యేంచేస్తాడు? అయిపోయిందేమో అయిపోయింది.....

నారా: మీ కేమండీ? మీ అబ్బాయి బాగానే వున్నాడు. ఇంతకీ వొచ్చింది మా అమ్మాయికి......

వెంక: యేమిటండీ వొచ్చింది? మీ అమ్మాయికిమాత్రం. తీసికెళ్ళి గుట్టుచప్పుడుకాకండా వుంచుకోండి యింట్లో! యెవరేమంటారో చూద్దాం! యెవరండీ అనేది? రమ్మనండి, యీయిల్లు యిట్లాంటి వ్యవహారాలు లేకండా వుందో. యిక్కడింకా యేదో చిన్నపిల్లలు. బైటికి చెపితే సిగ్గుచేటు. అందరూ గొప్పవారే. అందరిభార్యలూ పతివ్రతలే. పెద్ద జరీ చీరెలు కట్టుకొని పెద్దబొట్టు పెట్టుకుని, సిగ్గుతో తలొంచుకుని వస్తే చాలు.

శివం: అయితే మీ కెందుకూ యీ సిగ్గూ, తొందరా, అందరియింట్లో సాధారణంగా జరిగేదేగా?

వెంక: మాయింట్లో యెన్నడన్నా యిట్లాంటివి......

శివం: మీయింటి సంగతి యింకోడికీ తెలును. వాళ్ళ సంగతి మీకు తెలుసు. వాళ్ళకి తెలుసునని మీకూ తెలుసు, మీకూ తెలుసునని వాళ్ళకీ తెలుసు. వొకరిది వొకరికి తెలీనట్టుగా నటించాలి. లోపల యింకోళ్ళకీ తెలీకుండా యెంత కుళ్ళిపోయినా సరే, పైకి మర్యాదస్తులవలె కనపడాలి. యిదే జీవనానికి మూలసూత్రం.

వెంక: గోదో వుండండి. రండి నాయుడుగారూ, కదలరేం! పది దాటింది.

నారా: అంతేకాదండీ. నేను చెయ్యిచేసుకుంది యెందుకు మరి? మీకు నాయుడు మనమడో, మనమరాలో ...

వెంక: మెల్లిగా, మెల్లిగా, వొద్దువొద్దు. తెలిసింది.

అమ్మో!

(కుర్చీలో కూలబడి, కళ్ళు మూసుకున్నాడు.)

శివం: (పంతులికి షేకాండిచ్చాడు.) కన్గ్రాట్యులేషన్స్.

[పంతులు తెల్లబోయి భయంగా చూస్తున్నాడు. హనుమంతరావు నవ్వుతున్నాడు.]

[సుందరమ్మ లోపల్నించి 'ఆముండ యీ యింట్లో వొక్క నిమిషం వుండడానికి వీల్లేదు. బయటికి గెంటండి. అప్రాచ్యకం' అని అంది.)

వెంక: యేమిటిచెయ్యడం?.....(పంతులుతో) వొరే! యెక్కడ దాపరించావురా నాకు? నాకడుపు చెడపుట్టావురా, బాబూ. చావకపోయినావురా యింతకంటే.

నారా: నేను వెడతానండి.

[లోపల్నించి సుందరమ్మ 'దాన్ని ఆ అప్రాచకపు ముండని గెంటండి. ముందు పంపెయ్యండి. మీ నెత్తిన తొద్దామనుకుంటున్నాడు కాబోలు యేమో! యెవరికడుపో!' అంది)

శివం: 'మాడెస్టీ' అంటే అట్లా వుండాలి.

వెంక: మీకెందుకండీమధ్య? యేమిటాకూతలు? యింక వూరుకోండి చాలు.

శివం: ఆమాటలు చాలా బాగున్నాయి కదండి? పోనీ, వెడతా లెండి. ఆకలిగాకూడా వుంది. (లేచాడు.)

సుశీ: శివం, నీకు బంగళా తెలీదు. నేను చూపిస్తాను వుండు. (లేచింది.)

వెంక: పొరబాటు, క్షమించండి. ఇదో నా — గోలల్లో నా మతే పోయింది. ఇదుగో, భోజనానికి తెస్తాం. ఇది అయిపోనీండి. (నాయుడుతో) నాయుడుగారూ, నా తల తిరిగి పోతోంది. యేం చెయ్యమంటారు చెప్పండి.

నారా: నాకేం తెలీదండి. మీ యిష్టం, మీ కోడలు—

మహా: యిట్లాంటి అవస్థలో కూడా నన్ను యెక్కడికి పొమ్మంటావయ్యా?

నారా: నాకేం? అసలు తెచ్చుకోమన్నారా? నాకు తక్కున బిడ్డలున్నారు. రేపు వెలివేస్తే—

శివం: (పంతులుతో) దీనికంతా మీరూ కారణం. వొక్కమాట మాట్లాడరేం?

[లోపల్నించి సుందరమ్మ 'వాడా కారణం! వాడా? అదీ, వాణ్ణి పాడుచేసి, బలవంతం చేసి, పిచ్చివాణ్ణి చేసింది. అదా, వాడా? వాడేమెరగడు అసలు. వెన్నడన్నా'—అంది.)

(హనుమంతరావు నవ్వుతున్నాడు.)

వెంక: చాల్లే వూరుకో.

శివం: (పంతులుతో) యేమండీ మీరేమంటారు?

హను: యేమంటాడు? యింకెక్కడన్నా యింకో పిల్ల వుంటే...

పంతు: (హనుమంతరావుతో) సిగ్గులేక నువ్వుకూడా నన్ను వెక్కిరించాలి? మొన్ననేగా నాగరత్నంచేత మొహాన తన్నించాను!

శివం: అవన్నీ సంగతెందుకులెండి. పాపం ఆమెని మళ్ళీ

ఆ గోవిందుబాబు కోర్టుకానికి తీసికెడితే మీరు సాక్ష్యా వ్యారు కుంటారా?

పంతు: నాకు తెలీదు. నేనేం చెయ్యను? నేను రమ్మన్నానా? అంత జాలిగావుంటే మీరు కష్టపడండి. నాకేం?

నారా: (కోపంతో) రమ్మనలా! వేగే రమ్మన్నాగా. సిగ్గెయ్యటంలా; ఆ మాటలనడానికి మూల్లనించి పోయుంగా పోతులాగు...

మహా: కన్నతండ్రి మీాకే ఇక్కట్లేకపోతే, వాడికండీ...

నారా: (కాంతమ్మతో) నేను వెళుతున్నా. ఈయన కోసం వొచ్చావుగా! ఆయనతో నేవుండు. మళ్ళీ నాగుమ్మం లోకి వొచ్చావంటే చచ్చావే!

(నాయుడు బయిటు గుమ్మందగ్గిర చెప్పు లేసుకుంటున్నాడు.)

వెంక: నాయుడుగారూ! నాయుడుగారూ! వెళ్ళకండి. ఒక్క మాట.

కాంత: పంతులుగారూ! మీరేనండి దిక్కు నాకు. నన్ను పొమ్మనకండి. దిక్కులేనిదాన్ని.

(నారాయణరావునాయుడు వెళ్ళాడు.)

[తలుపు తటాలున తెరుచుకుని సుందరమ్మ వొచ్చింది. బిర బిర వొచ్చి కాంతమ్మ మెళ్ళో రెవిక పట్టుకొని లాక్కుంటు బయిటికి వెళ్ళింది.]

సుంద: ఏ మళ్లీ యీ గుమ్మం తొక్కు చెపుతా.

[కాంతమ్మ 'నాన్నా, నాన్నా,' అని యేడుస్తోంది. గొంతుక దూరమవుతోంది. సుందరమ్మ వొచ్చింది.]

శివం: ఛీ. ఛీ. వొక్కరికి గుండెలేదు. అందరి హృద

యాలు కుళ్ళిపోయినాయి. సుశీలా! వెళ్లి ఆ అమ్మాయిని తీసుకురా. నీకన్నా జాలి రావటంలేదూ?

సుశీ: నాకు తెలీదు, ఎందుకు జాలిపైగా!

శివం: పేంప్రల్, నేనువెళ్లి తీసుకొస్తా.

సుంద: యిక్కడికి తీసుకురావడానికి వీల్లేదు.

శివం: తీసుకురానులెండి. సుశీలా! నాతోరానుతే.

సుశీల: నేనూ నీతో వొస్తాను. కాని నువ్వు ఆ అమ్మాయిని తీసుకురావద్దు.

వెంక: మీ కెందుకండీ?

శివం: నా కెందుకేమిటి? మీఅశ్రాయి కక్కర్లేకపోతే...

వెంక: యింటికెళ్లిన తరువాత వాళ్ళే సర్దుకుంటారు. కన్నబిడ్డని వీధిలో వొదిలేసుకుంటారా యేం? మధ్య మీరు వెళ్లి రంగం చెడగొట్టకండి.

శివం: ఆ రాస్కెల్ యింటికి వెళ్ళనిస్తానా? వాడు – వాడు చంపేస్తాడు ఆమెని. యిది సమయమా మీ మర్యాదలూ, అవుమర్యాదలూ, ఆలోచించుకోడానికి? ఆమెని యెట్లా సంతోషంగా, బలంగా, వుంచడం, ఆ పుట్టబోయే బిడ్డ, ఆరోగ్యంగాపుట్టే మార్గమేమిటి, అని ఆలోచించాలి. ఆయింట్లో యీమె బతుకు నరకంకాదూ? గర్భిణిని యెట్లా వుంచాలి, యెంత సంతోషంగా, యెంత జాగ్రత్తగా, చూడాలి? ఆపుట్టేపిల్ల నష్టపడితే, మీలో యెవరు జబాబుదారీ? మీ కేం? యిదే పెళ్లి అయిన తరవాత పుడితేయెంతో వుత్సవాలుచేసి, సంతోషపెడతారే! యిప్పుడుమాత్రం, అట్లానే కనటంలా? యిప్పుడు చివాట్లూ, దెబ్బలూనా?

సుంద: అసలు వీడేనేమో! ఇదివరకు తెలుసునా ఆ ముండ వీడికి?

సుశీ: ఛా! ఉన్నారే కొత్త శివానికి.

సుంద: యిక్కడి పెదతాడుగాపును దాన్ని తీసుకొచ్చి!

మహా: నాయనా, పంతులూ! సంబంధం లేనట్లు చూస్తావేమిరా? ఆ అమ్మాయి గతేమిటి?

(పంతులు మాట్లాడడు.)

వెంక: వాడికెందుకూ? అంతవరకే వాడికి కావలసింది. అచ్చు బోసిన ఆంబోతు.

సుంద: మొగాడు, వాడికేం?

మహా: పోనీరా, పంతులికి ఎదో ఉద్యోగమిప్పించి, ఆ అమ్మాయిని వాణ్ణి కాపరం పెట్టకూడదూ?

హను: (వేళాకోళంగా) చాలా బావుంది.

పంతు: (హనుమంతరావుతో) నీకెందుకు? యీసారి నా సంగతి యెత్తావంటే తంతా జాగ్రత్త.

సుంద: దాన్నా! దాన్నా! ఆకడుపొచ్చిందాన్ని, నా అబ్బాయికా!

పంతు: దాంతోనా? ఆశూద్రదాన్ని పెట్టుకునా!

మహా: అయ్యో! మఱి ఆశూద్రది యింతవఱకూ యెట్లా?

వెంక: నాపరువూ ప్రతిష్టా వుంచాలా? నాకు మళ్లీ యెవడన్నా వోటియ్యాలా?

మహా: యిప్పుడేగా, యీ చైర్మను పని వొద్దన్నావు?

వెంక: అసలు "లా" వొప్పదు.

మహా: యింతవఱకు "లా" వొప్పుతుందా?

వెంక: యింతవఱకూ చొప్పను. "లా" కి దీంతో యేం సంబంధం లేదు.

మహ: నేనేమీ తెలీదాన్నే? యేమెరగని ఆపిల్లని ఆయన అన్యాయం చెయ్యడం, ఆతండ్రి చావబాదడం, ఆయన సంబంధం లేనట్లు చొదిలెయ్యడం, ఆ పుట్టేబిడ్డ, పుట్టడమే దిక్కు లేనిదై పుట్టడం, యింతవఱకూ "లా" చెప్పతుంది? యిద్దరికీ పెళ్లిచేస్తామంటే మర్యాదగా చొప్పదూ? పెళ్ళంటే యింతకంటే యింకేం కావాలి? "లా" ఆ అమ్మాయిని యితను పెళ్ళిచేసుకునేటట్టు చెయ్యలేదు, యింత అన్యాయం జరిగింతరవాత?

వెంక: నీకు రానురాను మతి పోతోంది, అమ్మా!

[శివం కాంతమ్మని చెయ్యిపట్టుకుని లాక్కొచ్చాడు. కాంతమ్మ సరిగా రావటం లేదు.]

శివం: మరి మీ యింటికి వెళ్ళక యేం చేద్దామని?

కాంత: యిన్ని గోతులూ నూతులూ లేవూ...

శివం: బాగానేవుంది, పడ్డతరవాత, పీనుగుని తియ్యడం, విచారణ, సాక్ష్యం యివన్నీ యెవరు పడతారు! యీ చచ్చే వాళ్లు ఆ సంగతి ఆలోచించరు.

కాంత: నన్ను చావనియ్యను కూడా చావనియ్యకపోతే యెట్లా?

సుంద: సుశీలా! ఆ నున సామానులు చాకలిని తెమ్మను.

సుశీ: ఆయన్ని పంపించొద్దు. ఆయన వెడితే నేనూ వెడ తాను.

సుంద: ఆయన వెడితే నువ్వు వెళ్ళడమేమిటి?

సుశీ: మతి ఆయన్ని రమ్మని యింటికి పిలిచి అర్ధరాత్రి వెళ్ళగొడతారా? మళ్ళీ కాలేజీలో నాకు పరువుపుండాలా?

సుంద: అయితే, ఆ పిల్లని యింట్లో పెట్టుకోమంటావా?

సుశీ: శివం! నీకెందుకు ఆరేచ్‌తో, పొమ్మను.

శివం: యింత చదువుకున్నావు. మెడికల్ లైనులో ప్రవేసించావు—

పంతు: ఆ నా యిళ్ళమ్మాయి మాయింట్లో వుంటే, నే నుండను.

శివం: స్కాన్డైల్!

హను: యింక ఆ అమ్మాయితో పని అయిపోయింది.గా?

[పంతులు యీడ్చి హనుమంతరావుగారిని దవడ మీద కొట్టాడు. హనుమంతరావు కిందపడ్డాడు]

పంతు: పేరెత్తితే తంతానన లేదూ! నీ ప్రాణానికి నువ్వు కూడా—

సుంద: అన్యాయంగా వాణ్ణెందుకురా కొట్టావు? యిం దాకణ్ణించి నిన్ను అడ్డమయినమాటలూ నోటికొచ్చినట్లల్లా కూస్తున్న వాళ్లుండగా! నీ పౌరుష మేముంది?

[పంతులు కోపంతో శివంవొంక చూస్తున్నాడు]

సుశీ: అన్నయ్యా! నీ పొగరుమోతుతనం ఆయనమీద కాదు. మామయ్యమల్లే తిండికి గతిలేక వొచ్చాడనుకున్నా వేం నీ చేతపడ్డానికి?

పంతు: యేంచేస్తాడు? యీమాటు నన్ననమను?

సుశీ: (వెంకటేశ్వర్లు గారితో) నాన్నా! యిక్కడ

నా గెస్టుకి వయసెన్ను జరిగేట్టయితే యిప్పుడే వెళ్లిపోతాం యిద్దరం...

వెంక: (పంతులుతో) చాల్లే, నోరు ముయ్యి, మొహం తిప్పేసుకు తిరక్క, యింకా మాట్లాడుతున్నావు సిగ్గులేక? ఫో! అవతలికి ఫా ఫో!

[నారాయణరావునాయుడు వొచ్చాడు.]

నారా: యేమిటండీ! వృథా కోపాలు తెచ్చుకుంటే లాభముందా? మీరూ నేనూ వొద్దంటే ఆ బిడ్డ గతేమిటి?

వెంక: అందుకనే నేను చెపితినిగా పాపం. ఆ బిడ్డని తీసుకెళ్ళండి.

నారా: ఆరు నెల్లల్లో ఆ మహాగండమో...—యెట్లా నన్నా బయిటికి రాకుండా జరిగిపోతే......

వెంక: యెక్కడికన్నా పంపించండి. యెవరూ అంత మాత్రం సహాయంచేసే బంధువులు లేరూ?

నారా: వెధవకులం. మాదానంత ఛండాలకులం ఎక్కడా లేదండీ. ఎవరన్నా పేరు చెడిపోతే సంతోషిస్తామనే వాళ్లు తప్ప......

వెంక: ఎదో వొక సదుపాయం ఆలోచించవచ్చు, ప్రస్తుతం—

నారా: అమ్మా! అమ్మా! మీరేం చూడలేరూ?

వెంక: బ్రాహ్మలం, మీఅమ్మాయిని మేమేంచేసుకోం...

సుశీల: నువ్వేం హెల్పు చెయ్యలేవూ?

శివం: నే నేం చెయ్యను?

సుశీల: నాన్నా! శివం, మెడికెల్ మాన్. తలుచుకుంటే

సహాయం చెయ్యగలడు.

వెంక: నాకేం తెలీదు.

సుంద: అంతమాత్రం సహాయం చెయ్యకూడదూ!

నారా: (తటాలున శివం కాళ్లమీద పడి) అయ్యా! బాబూ! నాపేరు నాప్రతిష్ఠ. నా కూతురు మానం, అన్నీ మీచేతుల్లోవున్నాయి. దైవంలాగు తటస్థపడ్డారు. యిక్కడ యీ కొంచెం సహాయంచేస్తే బతికున్నాన్నమాట.........

శివం: లెండి, లెండి. నాకు తెలీటంలా! నేనేంచెయ్యను?

నారా: తెలీకేం లెండి. యేదన్నా ఔషధమిచ్చి యీ గండం తప్పిస్తే......

శివం: మీరు పిరికివాళ్ళయితే, నాకేం? ఇమ్మారల్. పాపం, ఆబిడ్డ మెటర్నల్ ఫీలింగు చంపుతారా? నన్నడక్కండి.

నారా: అట్లా అనకండి. యెందుకూ పనికిరాకుండా పాడవుతుంది దాని బతుకు. ఆబిడ్డ బతుకు......

శివం: యేమీ పాడు కాదు. మీ బతుకులు పాడవుతాయనీ మీ భయం. ఆ అమ్మాయిమీద దయే యిదంతా? ఆ పుట్టే బిడ్డమీద దయే? అందుకునేగావును, ఆ గర్భిణి స్త్రీని అట్లా బాదారు. యిందాక? నాకు కళ్లులేవూ?

నారా: యేమవుతుందండి దానిగతి? యెవరు పెళ్లి చేసుకుంటారు దాన్ని?

శివం: యేమీకాదు, పెళ్లికాకపోతే పోనీండి. ఆరునెల్లకి పండంటి బిడ్డని నవ్వుతో యెత్తుకుంటుంది. యీలోపల మీరు కొట్టకుండావుంటే చాలు.

నారా: మరి ఆ బిడ్డ గతీ......

శివం: నాకియ్యండి మీకు సిగ్గయితే. నేను పెంచుతాను.

నారా: బాగానే వుంది. కొంచెమన్నా జాలి లేదండీ? నమ్మల్ని తిట్టారు. గుండెల్లేనివాళ్లమని.

శివం: ఇంక నాతో యీ విషయం మాట్లాడితే పోలీసు రిపోర్టు చేస్తా.

వెంక: మీకు కష్టమయితే పోనీండి. నేనేమీ అడగలేదంషోయి మిమ్మల్ని. నాకేం సంబంధం లేదు.

నారా: (కాంతమ్మతో) పోనీ, రావే! ఎవరి సహాయం అక్కర్లేదూ!

శివం: ఎట్లానో వొకట్లా, ఆ పని చెయ్యాలని చూస్తున్నారు లెండి. యెప్పుడయినా, నాకు తెలిసిందంటే—

నారా: పోవయ్యా. అట్టే వాగకు. (కాంతమ్మతో) ఏం వొస్తావా రావా?

కాంత: నన్నేంచేసినా నేను రాను.

శివం: [షేకాండిచ్చి) గ్లోరీ గ్లోరీ.

సుశీల: శివం! నిన్నుచూస్తే నాకు వొళ్లుమండిపోతోంది.

మహా: అమ్మా! మీనాయనగారు కాక, యింక నీసంగతి కావలసినవాళ్లెవరమ్మా? వెళ్లు నామాట విని వెళ్లు.

కాంత: నన్ను చంపుతాడు. నేను వెళ్లను.

మహా: నేం చెయ్యకండీ!

నారా: దీన్నా వొదిలేది? దీన్నా?

[కర్రెత్తుతున్నాడు]......

శివం: స్టెడీ, స్టెడీ.

నారా: నువ్వెక్కడ పోగయినావయ్యా! (కాంతమ్మతో) రావే!

కాంత: రాను.

నారా: నీఖర్మం చావు. ఎవరిక్కావాలి. పీడవదిలి పోయింది.

[వెడుతున్నాడు]

[సుందరమ్మ లోపలినించి తొరతొరగా కాంతమ్మ దగ్గిరి కొచ్చింది.]

వాసీ! యింకాపో లేదుటే నువ్వు పీనుగవుండవి.
యెక్కడ పోగయినావే మాయింటికి! పో! పో!

(జుట్టు పీకుతో బయటికి లాగుతోంది.)

శివం: (వెంకటేశ్వర్లతో) డెవిలిష్. యింక నేను శ్ర చేసుకోవాలి.

సుంద: ముందు నడు.

కాంత: యెక్కడికి పోనూ? యెక్కడికి? (ఏడుస్తోంది.)

(సుందరమ్మ కాంతమ్మ మెడపట్టి గెంటుతోంది)

శివం: (కోపంతో సుందరమ్మమీదికి పోయి, తోసే శాడు.) నా గెస్టు. ఆమెని నేను తీసుకొచ్చాను ఏంచెయ్య కండి.

హను: యెవడ్రా నువ్వు? ఆడవాళ్ళని చెయ్యిచేసు కుంటావు?

శివం: అది యెవరు మనిషేనా! రాక్షసిలాగు అట్లా మనుషుల్ని పీకుతుంది?

(హనుమంతరావు శివాన్ని గెంటుతున్నాడు.)

శివం: చెయ్యి తియ్యి. వోన్, టూ, త్రీ.

[హనుమంతరావుని బూచ్చుకాంతతో నడుంమీద తన్నాడు. పంతులు నవ్వుతున్నాడు.]

సుశీ: అయితే శివం! యేంచెయ్యమంటావు? ఆ పిల్లని నువ్వే పంపించు. ఆమె యిక్కడ వుండడానికి వీల్లేదు.

శివం: ఛీ, ఛీ, చాలా నోబుల్ గర్లనుకున్నా నిన్ను. నీకే అట్లా అయితే యెట్లా వుంటుంది?

సుంద: ఛీ. ఛీ, అవేం మాటలు? మతిపోతోంది.

శివం: యేం. మీఅమ్మాయి ఆడదికాదూ? మీరు కాదూ? ఆడది యింతరవాత యెవరికయినా.....

సుంద: (వెంకటేశ్వర్లుతో) యేమిటండీ.....

శివం: (సుశీలతో) నీకే అట్లా అయితే, వీళ్ళలో వొక్కరన్నా నీమీద ఒక్కరివ్వ జాలి చూపిస్తారా? యీ తండ్రి అట్లానే కొట్టేవారు. యీ తల్లి అట్లానే యేడుస్తుంది. ... అన్న అట్లానే పోదిలేస్తాడు.

సుశీ: నన్నూ దాన్నీ వొకటిగా కట్టావా? నా సంగతి నీకు తెలీదూ? యింతే! నేనూ అట్లాంటి ఫ్లాల్ననే నీ ఉద్దేశ్యం?

శివం: నువ్వు చాలా వైజ్ గా, యేం అపాయంలేకుండా, తప్పించుకుంటావు. ఈ అమ్మాయికి హృదయంవుండి పాపం, ఆయన చేతుల్లో, మోసపోయింది.

వెంక: యికచాలండీ. (కాంతమ్మతో) అమ్మాయీ వెళ్ళు.

శివం: నేనూ వెడుతున్నా (కాంతమ్మతో) రా,

వెడదాము.

కాంత: నేను రాను.

సుశీ: శివం! శివం! నీకేం సెన్సెస్ లేవ్వా? ఈ మిట్ట అర్ధరాత్రి, దాన్ని, దాన్ని, వెంట పెట్టుకెళుతా న్నా?

శివం: యేం?

సుశీ: అందరూ యేమనుకుంటారు?

శివం: వీళ్ళందరిమల్లే వ్రాళ్ళో అందరూ యేమనుకుం టారో అని నాకు భయమనుకున్నావా? (నవ్వి) నిన్న నువ్వూ నేనూ వొంటరిగా వొస్తే యేమనుకున్నారు?

సుశీ: యేమనుకుంటారు? నాకేం? నే నిన్న సెంటు నప్పుడు!

శివం: నేనుకాదూ? ఈఅన్నా యికాదూ? యిన్నా సెంట్. నీ అంత కపటములేటే యిట్లా ఉంనుకవుతుంది? మీ అన్నయ్య స్వభావం అప్పుడే కనిపెట్టేది. (కాంతమ్మతో) యెందుకురావమ్మా? యిక్కడ వీళ్ళల్లో యెట్లావుంటావు?

కాంత: మీ రెవరో కొత్తవారు. నే నెరగను. యెక్కడికి తీసి కెడతారు?

శివం: అది నాకూ తెలీదు. యింకెవరన్నావుంటే బావుండును. సుశీలా! ఆబిడ్డకి భయంగా వుంది. నువ్వు కూడా రారాదూ, యివాళ రాత్రికి మాతో? రేపుపొద్దున్న వొద్దుగాని.

సుశీ: ఛీ, అది నీతో వుండగా మాట్లాడనన్నా మాట్లాడను.

శివం: సరే, యింకేంచెయ్యను? (కాంతమ్మతో) నా మీద నమ్మకం వుంచు. నేనేంచెయ్యను? రా ఇక్కడ

వుండడంకంటె.

కాంత: రాను.

శివం: నేను వెడుతున్నా. యీ హార్ట్‌లెస్ పీపుల్ యింట్లో ఒక్కనిమిషం వుండను. సుశీలా వెడుతున్నా. సామానులు బంగాళాకి ప్రొద్దున్న పంపెయ్యి.

సుశీ: నేనూ వొస్తా.

శివం: వొద్దు. నే నెట్లానూ రేపు వెళ్ళిపోతున్నా. నా మనస్సేం బావుండలేదు. యీ అర్ధరాత్రివస్తే అందరూ యేమనుకుంటారు? నువ్వుకూడా 'ఫూలిష్'గా చేస్తావా? నామీద దయవుంటే నీదయగల తల్లిగారు పాపం ఆ అమ్మాయిని యేంచెయ్యకండా చూడు. నామీద చూపించే దయ ఆమెమీద చూపించు.

సుశీ: మళ్ళీ యెప్పుడు?

శివం: తెలీదు. చాలా డిజప్పాయింటుచేశావు. మీ నాన్నగారి మల్లే, అన్నమల్లే. నువ్వుకూడా చాలా సెల్ఫిష్. కాంతమ్మమల్లే కాలేదు గనుక నువ్వు చాలా గొప్పదా న్ననుకుంటున్నావు. యీ హృదయంలేని, పరువు ప్రతిష్టల స్వార్థపరత్వముకంటె, వేయిమాట్లు కాంతమ్మవలె, మోస పోవడం నయం. గుడ్ బై. (కాంతమ్మతో) ఎట్లాగూ నిన్ను వెళ్ళగొడతారు. వీళ్ళు లోకమంతా కాలిపోయినా, ఇంకోరికోసం, ఒక కొంచెమన్నా శాక్రిఫైస్ డు...వీళ్ళకి అట్లావుంటేగాని, లోకంలో మర్యాదస్తు లెట్లా అవుతారు? నేను వెళ్ళగానే నిన్ను తరుముతారు (సుందరమ్మను చూపి)

ఊగానేమీదపడి డెవిల్‌లాగు–(వెంకటేశ్వర్లుతో) వెడతా నంటే, ఖూనీ చేస్తా.

(వెడుతున్నాడు.)

వెంక: అమ్మా! వదిలిపోయినాడు.

సుంద: (కాంతమ్మతో) యింకా నువ్వెక్కడుండే నసు.

(కాంతమ్మ భయంతో పంతులు వెనకాలికి వెళ్ళింది.)

పద, ఒసీ! వాణ్ణి ముట్టుకో చెప్తా...

కాంత: పంతులుగారూ, పంతులుగారూ! (గోల పెడ్తోంది.)

(పంతులు కాంతమ్మని ఒక్కతోపుతోపాడు, కాంతమ్మ పడ్డది.)

(సుందరమ్మ కాంతమ్మని జుట్టుపట్టుకుని యీడుస్తోంది.)

వెంక: వుండు వుండు, ఏమిటిది?

కాంత: పంతులుగారూ మీ కాళ్ళు పట్టుకుంటా? మీయింట్లో దాసీగావుణ్ణోండి. నన్ను వెళ్ళగొట్టకండి. నాతో అన్నమాటలు జ్ఞాపకం తెచ్చుకోండి. వినరూ...

సుంద: (పంతులుతో) దానిమీద జాలిపడ్డావంటే, నువ్వు కూడా యింట్లోనుంచి నడవాలి.

మహా: నువ్వు వదులు వొకమాటు.

సుంద: వుండు ముందు దీన్ని లాగెయ్యాలి. అపరిదిష్ట.

మహా: నేను పంపిస్తాగా!

(సుందరమ్మ వొదిలింది.)

మహా: అమ్మాయీ యేంచేస్తావమ్మా వాడు నిన్ను వద్దంటున్నాడు. వాణ్ణి పట్టుకు బతిమాలుకుని యేంలాభం? యిక్కణ్ణించి వెళ్లు.

కాంత: యెక్కడికి?

మహా: మీ యింటికి వెళ్ళవుకదా !

కాంత: వెళ్ళను.

మహా: శివంగారి దగ్గిరికి వెళ్ళరాదూ ? వీడిమీద ఆశ పోయిందికదా, యిప్పుడన్నా !

కాంత: ఆయనెవరో, యెందుకు రమ్మన్నారో?

మహా: నా పిచ్చినాయనా ? వీడిమీద నమ్మకమున్నా ఆయనమీద అపనమ్మకమునా ? యెట్లా బతుకుతావంట యీలోకంలో ?

కాంత: నే నింక యెవరిని నమ్మను. నేను వంటరిగా వెళ్లను, యెవరిదగ్గిరికీ, పైకి మంచిగా వుంటాడు. అంతే.

మహా: ఎంతగతి వొచ్చిందమ్మా. నీ వంటి పసిదానికి ? యేంచేశావని నీకీ గతి? యేంచెయ్యనమ్మా నేను ?

(కాంతమ్మ యేడుస్తుంది.)

మహా: యేడవకు. భయంలేదు, దిక్కులేనివారికి దిక్కులేనివారే తోడు. అమ్మా నేను నీదాన్ని. నువ్వే నా కూతురవు. పదిహేనేళ్ళ క్రిందట పోయింది నా కూతురు. నీయీడుదే. దేవుడు నిన్ను పంపించాడు. నా దగ్గిరే వుండు. నీకు భయంలేదు.

(కాంతమ్మ మహాలక్ష్మిని కౌగలించుకొని యేడుస్తోంది. మహాలక్ష్మమ్మ కళ్ళవెంబడి నీళ్లు కారుతున్నాయి.)

వెంక: అమ్మా ! అమ్మా ! నీకు మతిపోయిందీ—

మహా: అవును నాయనా ముసలిదాన్ని. నా కింకా మతెన్నాళ్ళుంటుంది ?

వెంక: యీ నాయుడు పిల్లని మనింటో పెడతావా?

మహా: యేం?

సుంద: యీ యింటో వుండడానికి వీల్లేదు.

వెం: వీల్లేదు.

మహా: నాకు తెలుసు నాయనా, పుణ్యాత్ములు మీరు యీ దిక్కులేని పిల్లని వుణ్ణీరని. నా డబ్బిట్లా పారెయ్యి. వేరేయిల్లద్దెకి తీసుకుని, యీపిల్లతో కాపరం వుంటా.

వెంక: నాపేరో ? యింకేమన్నా వుందా ?

మహా: పోనీ, యెక్కడికన్నా పోతాలే.

వెంక: ఎక్కడికి? నేనొక్క దమ్మిడి యివ్వను. యెట్లా బతుకుతావు ?

మహా: యెట్లాగో వొకలాగు. ఆయన, పాపం, శివంగారు వున్నారుగా. ఆయనదగ్గరికి వెడుతున్నాం.

వెంక: ఛా, ఛా, వాడితోనా? ఆ నాస్తికుడితో, వాడికి కులంలేదు. నువ్వు....

సుంద: పోనిండి. మీ కెందుకు?

మహా: ఈ నాయుడిపిల్లను కావిలించుకున్న నాకుమాత్రం యింక కులమేమిటి నాయనా ? ఈ కడుపుతున్న పిల్లని చేరతీసిన నాకు పరువేమిటి ? వెడతాను.

వెంక: అమ్మా! నువ్వు వెళ్ళడానికి వీల్లేదు. నా ప్రతిష్ట నేంచేశావు. మా అమ్మ ఆశివంగాడితో యీపిల్లని పెట్టుకు పోయిదంటే. యేమన్నావుందా?

మహా: తెల్లారకట్ట రైల్లోనే వెళ్ళిపోతాంలే ? కాశీ పోయినానని చెప్పు అందరితో!

వెంక: అయ్యో నా కంటె, ఈ సంసారంకంటె, ఆ దిక్కుమాలినపిల్ల, ఎక్కువయిందా?

మహా: మళ్ళీ వొస్తాలే, మీరు రానిస్తే. నేను లేకపోతే మాత్రం మీకేంలోటు? (కాంతమ్మా, మహాలక్ష్మమ్మా వెడుతున్నారు.)

సుంద: అమ్మా! యిప్పటికివదిలింది పిశాచం, దానితో కూడా యీ ముసలిదాన్ని కూడ యెత్తుకు పోయింది.

వెంక: పంతులూ, ఎంతగోల తెచ్చిపెట్టావురా. ఇంకనైన బుద్ధికలిగి వుంటావా?

పంతు: ఇట్లా పరుగెత్తుకొస్తుందనుకున్నానా?

సుశీ: ఇంక పరవాలేదు. తమ్ముడు యే ఇబ్బంది తెచ్చిపెట్టినా శివం ఇంటికి పంపితేసరి. అమ్మమ్మకూడ వుంటుంది.

సుంద: సరే, దీనికా మొగాడితోస్నేహం తప్పిపోయింది. యెంత అపద్రిష్ట!

పంతు: యీసుశీలని చదివించడం వొచ్చింది, ఇదంతా.

సుంద: యింక చాలు యీ చదువు. యింటో కూచో.

సుశీ: నేనా మానేది?

సుంద: డబ్బెవడిస్తాడు?

సుశీ: శివం.

సుంద: యీ సుశీలకి వాడితో స్నేహమయిందికదా!

సుశీ: యేం స్నేహం? వాడిచేత యేడు పొడుగూతా యెనాటమీ చెప్పించుకున్నా. నాకు పాఠాలు చెప్పడంలో, తనపరీక్ష కూడా తప్పేట్టున్నాడు. కాని కాంతమ్మమల్లె వెర్రిదాన్నా పిచ్చిదాన్నా? యెంత దూరానవుంచాలో,

అక్కడే వుంచా.

సుంద: మరి వాడిమీద పడ్డావు ?

సుశీ: (నవ్వుతో) నేను పడతా, వాణ్ణి యేడిపించడానికి. వాడు నన్ను ముట్టుకుంటే, తంతా. నా పరువూ ప్రతిష్టా పాడు చేసుకుంటానా?

సుంద: వొచ్చినప్పుడు ఆ వాగుడంతా యేమిటి ?

సుశీల: మీకు నామీద అట్టేఅధికారం లేదనీ, అణిగి పడివుండే మునపటి సుశీలను కాననీ, మీకు చూపించడానికి. అంతే కాని నా ప్రతిష్ట నేను పాడుచేసుకుంటానా ? నేను వాడి చేతుల్లో మోసపోతానా ?

పంతు: వెధవ, వాడితో యెట్లా స్నేహం చేశావంట. ఆయెంగిలి ముండని వెంటేసు కెళ్ళాలనే వాడి యెత్తంతా. కాని కాంతమ్మ అప్పటికీ నన్ను వొదలదు. ఆడవాళ్ళ ముందర వాడెందుకు పనికొస్తాడు? నేను తన్నేస్తేనేగాని కాంతమ్మ కదిలిందా, వాడు బతిమాలితేమాత్రం? యిప్పుడయినా, నేను పిలిచానంటే.. ...

వెంక: చాలు, ప్రతాపం. యింతకీ అట్టే గోలలేకుండా జరిగిపోయింది. నాయుడితో కాంతమ్మనీ, అమ్మనీ యేదో వూరు పంపామని చెప్పొచ్చు. ఆ కృతజ్ఞతతో, కుక్కమల్లే, చెప్పినమాటలు వింటాడు. ఆ వార్డు వోట్లన్నీ నావే.

పంతు: సుశీల ఆ శివాన్ని తీసుకొచ్చింది. మంచిపని చేసింది.

సుశీ: కాని శివం చాలా గొప్పవాడు. నాన్నా! చాలా సంగతులు నేర్చుకోవాలి శివం దగ్గిర్నించి.

(తెర పడింది.)

# సుందరం

## పాత్రలు

*

1. వెంకట్రామయ్యగారు:—తండ్రి.
2. లక్ష్మిందేవమ్మ :—తల్లి.
3. రంగారావు :—భర్త.
4. సుందరం.
5. నారాయణరావు :—పినతండ్రి.
6. సీత :—నారాయణరావు భార్య.
7. రామమూర్తి :—సీత అన్న.
8. శశిరేఖ.

*

# సుందరం

## ఒకటో రంగం

[వెంకట్రామయ్యగారి యింట్లో పడకగది. శోభనానికి అలంకరించి వుంది. పట్టెమంచం; బల్లమీద ఫలహారాలు; అత్తరూ, గంధం, పువ్వులూ. రంగారావు చిరునవ్వుతో మంచంమీద కూచునివున్నాడు. శోభనం పెళ్ళికొడుకు అలంకారం. లావుగా, నల్లగా వున్నాడు. యిరవైయెనిమిదేళ్లు. గది పక్క తలుపులోంచి, యిద్దరు ముత్తయిదులు సుందరాన్ని తీసుకొచ్చి దిగపెట్టారు. సుందరానికి పదహారేళ్ళు. లావు, మంచిరంగు వొంటికి. శోభనం పెళ్ళికూతురు వేషం. సుందరాన్ని లోపలికి నెట్టేసి, ఆయిద్దరూ బయట తలుపేసుకు వెళ్ళారు. సుందరం అక్కడే నుంచుంది.]

రంగా: యిట్లారా, కూచో.

(సుందరం వెళ్ళి పరుపుమీద దూరంగా కూచుంది.)

ఆ తాంబూలం యిట్లా తే!

(యిచ్చింది. తింటున్నాడు.)

ఆ గంధంగిన్నె యియ్యి.

[యిచ్చింది, కొంచెం తీసి, వొంగి సుందరానికి పుయ్యబోయినాడు. దూరంగా జరిగింది,]

పోనీ, నాకొంచెం పుయ్యి. యింకా సిగ్గేమిటి? యిట్లారా, దగ్గిరిగా, ... రావూ ... ఆసిగ్గేమిటో చూస్తాగా ... కదలవేం? ... నేనే కదలాలీ ......

(వొంగి సుందరాన్ని లాగుతున్నాడు.)

సుంద: వొదలండి.

రంగా: యింక వొదలడమేమిటి? వొదలడమే? నన్నే నువ్వు వొదలవు. (నవ్వుతున్నాడు)

సుంద: చిన్నాన్న రాసిన వుత్తరమందలా?

(వొదుల్చుకుని మళ్ళీ దూరంగా కూచుంది)

రంగా: (మొహం చిట్లించి) అయితే—

సుంద: ఆ వుత్తరంలో రాసిన సంగతి కేమంటారు?

రంగా: ఆ మతిపోయిన వెధవ. కులభ్రష్టుడు, వాడు, రాసిన వుత్తరానికి సంజాయిషీ చెప్పడమేనా, నాపని, యీ రాత్రి? యిట్లారా, అంతకంటే మంచి—

సుంద: నేనే ఆవుత్తరం రాయించింది.

రంగా: నువ్వా? నువ్వా? నువ్వు! నువ్వు - అయితే మాత్రం.

సుంద: దానిసంగతి ముందు మాట్లాడండి.

రంగా: (చిరునవ్వుతో) తరవాత. ముందు రా! అన్ని సందేహాలూ - (లేవబోతున్నాడు)

సుంద: వొద్దు. ఇట్లా రావొద్దు. నాకిష్టం లేదని రాయలేదూ?

రంగా: కార్యం నీకిష్టలేదనా? యిప్పుడేమి లాభం? అయిపోయిందిగా?

సుంద: యేం కాలేదు.

రంగా: నీకు జబాబు చెప్పడం యిట్లా కాదు. యేంకా లేదూ?

(వొంగి మీదికి వొరుగుతున్నాడు)

సుంద: (చాలా అధికారంగా) నన్ను ముట్టుకో వొద్దు.

(రంగారావు, ఆకంఠం విని దడిసి ఆగాడు.)

రంగా: ఆడదానివి కాదూ? యిష్టంలేక పోవడమేమిటి?

సుంద: ఆడదయితే యిష్టముండి తీరాలా—

రంగా: వుండక్కర్లా! యెవరికోసం?

సుంద: ఆడది బతకడం, యిష్టముండితీరడాని కన్నమాట.

రంగా: అవును, సంసారానికి కదూ—భర్తకోసం, పిల్లల కోసం.

సుంద: అంటే పిల్లల్ని కనడానికీ, పెంచడానికీ, మళ్లీ కంటోవుండడానికీ?—అయితే మొగాడు బతకడం—

రంగా: సంసారం పోషించడానికి, సంపాయించడానికి.

సుంద: అంటే వుద్యోగం చెయ్యడానికీ, అధికారం చెయ్యడానికీ, లోకానుభవం సంపాయించడానికీ—ఆడదిమాత్రం, మొగాడు యింటికొచ్చినప్పుడు, పిల్లల్ని కనడానికి సిద్ధంగా వుండడానికీ—నేను మరనా, బానిసనా, మీకింద పిల్లలు కని అంతకంటే యేమీపనిలేక పడివుండడానికి? అట్లా అయితే, నామీద నాకు పరమ అసహ్యం పుడుతుంది. నన్ను ఇంకోళ్ళని అట్లా వుపయోగించనీను.

రంగా: అయితే పెళ్ళెందుకు చేసుకున్నావు?

సుంద: నేను చేసుకోలా, నాకు చేశారు.

రంగా: అవును. నీతలిదండ్రులు చేశారు. నువ్వు వొప్పుకోవాలి.

సుంద: యెందుకు వొప్పుకోవాలి?

రంగా: వాళ్లు నిన్ను కనిపెంచి, నీ యోగక్షేమం విచారించే యీ పెళ్లి...

సుంద: మీ తలిదండ్రులు మిమ్మన్ని మీ వుద్యోగం మానెయ్యమంటే మానేస్తారూ? మిమ్మన్ని కని పెంచి.

రంగా: నేను పెద్దవాణ్ణి.

సుంద: నేను కాదూ ?

రంగా: నేను మొగాణ్ణి.

సుంద: నేను ఆడదాన్ని.

రంగా: ఆడదానివి గనకనే...నువ్వెవరంట వొద్దన డానికి ?...సంఘం పెట్టిన యీ కట్టుబాట్లని తోసెయ్యడం నీ శక్యమే?

సుంద: తోసేస్తున్నా చూడండి. నాజీవితం సంగతి నేను చూసుకోకపోతే, యింకెవరు చూస్తారు ?

రంగా: నేనూ, నీ భర్తని, నేను.

సుంద: మీకంత కష్టమెందుకు? నాజీవితం సంగతి నేను చూసుకోలేనప్పుడు మిమ్మన్నడుగుతాలెండి. భర్తయితే నా ఆత్మా, ప్రాణం అన్నీ మీవే ?! నాకింక యిష్టమనేది లేదూ ?

రంగా: నేనుండగా నీకు స్వేచ్ఛెందుకు ? నీకేం తెలుసు ? మనిద్దరికీ ప్రేమవుంటే యిద్దరి యిష్టం వొకటికాదూ ?

సుంద: కాలేదుగా యిప్పుడు మరి? పోనీ అంత ప్రేమ వుందన్నవారు నామాటే వినరాదూ ?

రంగా: నువ్వు కాపరమే వొద్దంటే యింక నీతో వాదించే దేమి ? నువ్వాడదానివి కావన్నమాట !

సుంద: యెట్లాచేస్తే అట్లావొప్పుకుంటే ఆడది, లేకపోతే ఆడదికాదు, కొజ్జా. అట్లానే పిల్లల్ని కననిస్తే ఆడది, లేక

పోతే కొజ్జా. పాలిస్తే ఆవు, యియ్యకపోతే కాదు. నేను బతికింది, ఆడుకుంది, చదువుకుంది—అంతా యీ దేహాన్ని పెంచి, మీచేతుల్లో పెట్టి, మీ కామానికి వుపయోగపరిచేటందుకా? నాకు బతకడానికి హక్కు లేదూ మీదాసినై తప్ప ?

రంగా: లోకంలో అందరూ వొప్పుకోటంలా ?

సుంద: వాళ్ళ ఖర్మం.

రంగా: సంసారం అక్కర్లేక యేం చేద్దామని ?

సుంద: నేను చిత్రలేఖనం నేర్చుకుంటున్నా, దానిమీద చాలా ఆసక్తి వుంది.

రంగా: నేర్చుకో, నేను వొద్దన్నానా ?

సుంద: నాకు వొంటతోనూ, పిల్లలతోనూ మీరు చెప్పినదల్లా చెయ్యడంతోనూ వ్యవధి వుండదు. నే ననేకులదగ్గర నేర్చువాలి, అనేక వూళ్లు తిరగాలి, పిల్లలు బరువు. మీరు జెలసీతో ఆజ్ఞలు పెడతారు, సాగదు.

రంగా: యీ చిత్రలేఖనంకోసం సంసారం పాడుచేసుకుంటావా ? చిత్రలేఖనం యెవరి కుపయోగం ?

సుంద: నాకు,

రంగా: స్త్రీ భర్తకీ, పిల్లలకీ వుపయోగపడడానికి.

సుంద: కాదు. ముందు తను తనకి వుపయోగపడడానికి.

రంగా: నాసంగతో ? నాకు భార్య కావాలి.

సుంద: నాసంగతో ? నాకు భర్తా పిల్లలూ, అక్కర్లేదు.

రంగా: (కోపంతో) ఆడదానివి నువ్వు నాకు చెప్పడమేమిటి ?

సుంద: మొగవాడివి నువ్వు నాకు చెప్పడమేమిటి ?

రంగా: ఆహా! చెప్పనా, చెప్పడమేమిటో ?

[లేచివెళ్ళి, తటాలున, సుందరాన్ని కావిలించుకుని మంచంమీదికి తోసేస్తున్నాడు, సుందరం పెనుగులాడుతోంది]

సుంద: యిదే, మొగాడు కావడం, పశుబలం. దున్నపోతు నయం.

రంగా: (పోట్లాడుతో) ఎంతబలమే! కాశసివిగాని, ఆడదానివి కాదు. దెయ్యం!.......నిన్నిట్లా కాదు......నా చేతుల్లో చిక్కి......యింకెక్కడికెడతావు?......అబ్బా, వొదులు, వొదులు......నిన్ను......

[చివరికి మంచంమీద పడేశి, అణుస్తున్నాడు]

సుంద: వొదలండి. పశువులాగు, ఆడదాన్ని అట్లా పడెయ్యడం సిగ్గెయ్యటంలా, నెప్పి, వొదులు, చేతులో బలముందని...కాని నీకా నేను లోబడేది ?

[అతన్ని ఒకతోపు తోసివేస్తోంది]

రంగా: (కోపంతో) వొవడంట నిన్ను కన్నదీ, పెంచిందీ? ఎవతో దెయ్యంగాని......కనుక్కుంటూగా ? యీశోభనం యెందుకు చేశారో ? వేళాకోళమా! మాట్లాటకుండా పడివుంటావా ? మీవాళ్ళని పిలిచి అల్లరి చెయ్యనా ?

సుంద: పిలుచుకోండి.

రంగా: అన్నిటికీ తెగించిన దానికి నీకేం భయం ?

[తలుపు దగ్గిరికెళ్ళి]

యేమంటోయి, మామగారు, ఇట్లారండి వొక్కమాటు...

[వెంకట్రామయ్యా, నారాయణరావూ, లక్ష్మిం

దేవమ్మా వొచ్చారు.]

వెంక: యేమిటండీ ?

రంగా: దాన్నే అడగండి.

వెంక: యేమే, సుందరం ?

సుంద: నే నిక్కడుండను, నన్ను బయిటికి రానీండి.

లక్ష్మం: అదేమిటి ?

రంగా: (కోపంతో) యేమిటండీ! యిదంతా వేడుక్క చేశారా. యింకేమన్నానా ? మీ అమ్మాయి కాపరం చెయ్యదుట.

సుంద: (తండ్రితో) నే నిదివరకే చెప్పలా మీతో ?

నారా: (రంగారావుతో) నేను మీకు రాయలేదండీ ?

రంగా: రాస్తే. మీ అంతటి మహానుభావులు రాశారని, నా శోభనం మానుకుంటానా ?

నారా: శోభనం మీదేనా, సుందరానిదికూడా కాదూ? దాని యిష్ట మక్కర్లా ?

రంగా: ఆడదాని యిష్టమేమిటి ?

నారా: ఆడది మనిషి కాదూ ? దానికి యిష్టం అయిష్టం లేవూ ? రోతపడేదాన్ని—పశువులన్నా చెయ్యవే అట్లా!

రంగా: లోకంలో అంతా పిల్లల్ని అడుగుతున్నారా ?

నారా: అవును. ఆడదాని నోరు కట్టేసిన యీ దేశంలో— సీతా, సావిత్రీ, మొదలయిన పతివ్రతల దేశం కదండీ, అందుకునే, యిట్లా గోలపెడుతున్న పిల్లల్ని—యిది పెళ్ళి కాదు—రాక్షసం—దౌర్జన్యం—బందిపోటు—మొగుళ్ళు కాదు పశువులు—

వెంక: నారాయణా, నీ కెందుకు వూరుకో. (రంగారావు తో) యిప్పుడేమంటారండీ!

రంగా: మీ అమ్మాయిని సరిగ్గా వుండమనండి. తిరగ పడుతోంది.

వెంక: మమ్మల్ని పిలవడం యెందుకు? మేమేం చేస్తాము? ఆడదాన్ని లోబరుచుకోవడం చాతకానివాణ్ణి–

రంగా: యిది ఆడదా?

లక్ష్మిం: (సుందరంతో) యేమే, నీకేం పొయ్యేకాలమే!

రంగా: ముట్టుకుంటే రక్కుతోంది, దూకుతోంది–

వెంక: యేం పరవాలేదు. మొదట అంతే అందరూ! దూక్కుండా చెయ్యాలిగాని–

రంగా: అరుస్తుంది.

వెంక: అరవనీండి, యిష్టమొచ్చినట్లు. యీ యింట్లో కొన్ని కారణాలవల్ల చెప్పినమాట వినకండా తయారయింది. యీపిల్ల అందుకనే మీ చేతుల్లో పెడితే తీరిపోతుందను కున్నా. అరవకండి, యెవ్వరం వినిపించుకోము. చుట్టుపక్కల యెవ్వరూ రారు. తన భార్యని తను స్వాధీనం చేసుకుంటే నోరెత్తే దెవరు?

నారా: యేమిటి బలికిపంపే గొడ్డునిలాగు, దీన్ని బల వంతంగా–

వెంక: ఛా, వూరుకో, నీ కెందుకు, నడు–

రంగా: (నారాయణరావుతో) పవిత్రమైన యీ హిందూ సంసారాన్ని యీ పశ్చిమవ్యూహాలతో పాడుచేస్తారండీ? సీత, దమయంతుల పతిభక్తిచూసిన యీ దేశాన్ని యిట్లా–

నారా: ఏకపత్నీవ్రతులు, శ్రీరాములూ, హరిశ్చంద్రుడూ వున్న దేశం కాదండీ—

రంగా: అవును, అందుకనే—

నారా: వుండండి. వొస్తా.

[వెడుతున్నాడు]

వెంక: (సుందరంతో) సరిగ్గా వుంటావా లేదా ?

సుంద: నే నసలీ గదిలో వుండను.

వెంక: వుండవు ? నిన్నింక మాటలతో పోనీను. ఆ పొగరెగిరిపొయ్యేటట్టు, వొక్కసారి—

సుంద: దెబ్బలు చాలానయం, ఆ ఘోరంకంటె —

వెంక: పట్టుకోవయ్యా— (లక్ష్మిందేవమ్మతో) రావే వెడదాం— (రంగారావుతో) మీరు మెత్త పడవొద్దు. ఆడదాని మాటలకి జడుస్తారా? ఈ కాపరాలుచేసే ముత్తయిదలందరూ, పదిపిల్లల తల్లులుకూడా, మొదట యిట్లా అల్లరి చేసినవారే—

(నారాయణరావూ, శశిరేఖా వొచ్చారు, శశిరేఖ ఇరవై యేళ్ళది. అందంగా వుంది)

నారా: (రంగారావుతో) మీకోసం ఈమె వచ్చిందండీ.

శశి: దొరికావూ ? యేమన్నావు ? భార్యను తెచ్చుకోనని వొట్టెయ్యలా ?

రంగా? యిదేమిటి యిక్కడికొచ్చావు ?ఎట్లావొచ్చావు ?

శశి: యెట్లాగో వొకలాగు. మీరందరూ వెళ్ళండి. నేనే యీయన భార్యని.

వెంక: యేమిటది ?

నారా: వాళ్లిద్దర్నీ మాట్లాడుకోనీండి, ముందు. రండి. రా, సుందరం. యేకపత్నీవ్రతుల దేశ మిది.

(తెర పడ్డది)

## రెండో రంగం

[వెంకట్రామయ్యగారి యింటో సుందరం గది. చిత్రకారుడికి కావలసిన సామానులున్నాయి. గోడని అయిదారు పటాలు. రంగులు, బ్రష్‌లు, యీజిల్సు, కుర్చీలూ, బల్లా. సుందరం పటం వ్రాస్తోంది. నారాయణ రావు వొచ్చాడు.]

నారా: సుందరం, రంగారావు మళ్ళీ పెళ్లి చేసుకుంటు న్నాడు. యిదుగో శుభలేఖ !

సుంద: (నవ్వుతో) యెన్నేళ్లుంటాయో పిల్లకి ? ఇంకా మళ్ళీ యెన్నేళ్ళాగాలో, పాపం ?

నారా: మనం అదిరిపోతామనుకొని వుంటాడు బహుశా, యీ శుభలేఖతో—

సుంద: యిది చూసినతక్షణం వెళ్లి కాళ్లమీద పడతా మనే—

(వెంకట్రామయ్య వొచ్చాడు)

వెంక: సుందరం, చూశావా? యిప్పుడేమంటావు?

సుంద: కొత్తేముంది ? అనుకుందేగా!

వెంక: మతి యేమాతావంట ?

సుంద: యేమాతా ! యిట్లానే వుంటా,

వెంక: యెన్నాళ్లు! యెట్లావుంటావు ?

సుంద: యెన్నాళ్లయినాసూ. యెందుకంత ఆశ్చర్యం? మొగాడైతే యీ బొమ్మ లేసుకుంటూ బతికితే ఆశ్చర్యపడతారా? ఆడదానివిషయమై ఆశ్చర్యమెందుకు? నన్ను మీ కొడుకనుకోండి.

వెంక: అది కాదు, పెళ్లి మాట.

సుంద: దానికి దిగులు పడకండి. నేను దిగులు పడంది మీ కెందుకు?

వెంక: యేమో! యెప్పుడూ యిట్లాగుంటావా, మనసు మార్చుకుంటావేమో!

సుంద: మీ కపరిదిష్ట తెస్తాననా? ఆ భయం లేదు. ఆ అపరిదిష్ట నాది. మీకేం? మీ కెప్పుడు కిష్టంగాపుంటే అప్పుడు చెప్పండి. వేరే వుంటా.

వెంక వుండీ! వొక్కత్తెవూ యిట్లాగుంటావు!

సుంద: ఇట్లానే. ఆశ్చర్యమేముంది?

వెంక: ఆడదానివి. వొంటరిగా? యెందుకంత యీ కష్టమంతా? హాయిగా నిక్షేపమంటివి కాపరం చెడగొట్టుకొని—

సుంద: అదే అర్థం కాదు మీకు. ఆడదానికి రుచులూ, యిష్టాలూ ఆదర్శాలూ మెదడు వుంటుందని యీ దేశంలోని వాళ్లు సంపూర్ణంగా మరచిపోయినారు. చంద్రుడికి సూర్యుడుతప్ప కాంతికి గతిలేనట్లు, స్త్రీమనస్సులో కొత్త స్వంత వుద్దేశం కనపడ్డదా, అదిరి పడతారు. చంద్రుడు యెండకాసినట్లే. పతిభక్తి, పాతివ్రత్యం అనే పేర్లుపెట్టి, ఆడదాన్ని చంపారు. ఈ దేశంలో ఆడవాళ్లు లేరు. మొగాళ్లూ వాళ్ల ప్రాణంలేని నీడలూ.

సుంద: నాకేం? నా చిత్రలేఖనం నేనూ ప్రధానముగా, యింకేం కావాలి?

రామ: చిత్రలేఖనంతో సరిపోతుందా, ఆడదాని బతుకు. సంసారం లేనిది—

సుంద: మొగాడు ఎవరన్నా, నాకు సంసారంవుండి, నా పెళ్లాంపిల్ల పిల్లల్ని కనడం తప్ప యింకేమీ పనిలేదంటే, అట్లాంటివాడిమీద మీకెంత గౌరవ ముంటుంది? ఆడదట్లా కాదూ?

నారా: సృష్టిలో తినడం తప్ప ఏమీ ఎరగనివి జంతువులు, మనుష్యులు కాదు. ఆడదిమాత్రం ఆ జంతువుగానే వుంది యింకా—వంట చెయ్యడం, నగలు మొయ్యడం, రెండు పను లెక్కువ నేర్చుకుంది యిన్ని శతాబ్దాలకి.

రామ: ఆడది వుద్యోగాలుచేస్తే వంటా, పిల్లల్ని పెంచడం ఎవరు చేస్తారు?

నారా: పాకీవాళ్లి చదువుకుంటే, దొడ్లెవరూడుస్తారన్నట్టుంది. దొడ్లు వూడుస్తున్నారు గనక, గతిలేక, ఎప్పుడూ యింక, వాళ్ళని అట్లాగేవుంచి దొడ్లు వూడిపించాలి కదూ?

రామ: అయితే సంసారంకోసం ఆడది త్యాగంచెయ్యాలి. ఆడదాని జీవితం యిట్లాంటి త్యాగంలోనే సార్థకమవుతుంది. యిద్దరినీ వేరు విధంగా చేశాడు దేవుడు.

సుంద: దేవుడే విధించారంటారు, ఆడవాళ్ళకి దాస్యవృత్తి? మన దేశానికి కూడా దేవుడదే విధించినట్లున్నాడు. హిందూమాత స్త్రీయేగా! మొగవాళ్లూ, ఆడవాళ్లూ భేదంగావుంటే, వొకళ్ళు వొకళ్లకి దాసులు కావాలనివుందా?

దేవుడు అనేక వందల మనుష్యుల్ని చేశాడు. వాళ్లల్లో సగం వాళ్ళకి దాసులు కావలసిందే?

రాము: ఆడది గనక సున్నితంగా వుంట పడితే యేమిటన్న వుందా? బలహీనురాలు. అనేక ఆపదలు తటస్థిస్తాయి. ఒకత్తె సంరక్షణ లేనిదే నిలబడి లేదు.

నారా: ముందు రెక్కలు తెగగొట్టేవి, నిలబడి లేదనేది! కొన్ని వేళ్ళల్లో దేశాలే దాస్యబుద్ధి తెచ్చుకున్నాయంటున్నారే, అనేక యుగాల్నించి పడివున్న ఆడవాళ్లకి దాస్యబుద్ధిరాలా, బలహీనులుకాలా? అయితే దేశాలూ ఆడవాళ్ళూ—

రాము: ఆడది ఆర్జించినా, తెలివివున్నా, మొత్తానికి పిల్లలకోసం త్యాగం చెయ్యాలి, తన స్వాతంత్ర్యాన్ని, తల్లి పిల్లమీద చూపే ప్రేమకన్న అందమయింది లోకంలో యింకేముంది? తన హృదయమంతటితోనూ లోకాన్నంతా వొదిలి, తన శిశువులో, ఆనందాన్ని అనుభవిస్తుంది, హిందూస్త్రీ.

నారా: అట్లాంటి త్యాగాలవల్లే దేశం యిట్లా పాడయింది. అవసరమైన త్యాగంచేసే వాళ్ళంతనీచులు యెక్కడా లేరు. యెప్పుడు త్యాగంచెయ్యకపోతే భర్తతంతాడో, వొదులుతాడో, అని భయం. సీత నిప్పుల్లో వురక్కపోతే, రాముడు వొదులుతాడని సీతకి తెలుసు. అందుకనే ఆ మహాత్యాగం. ఆత్మగౌరవముండి, స్వేచ్ఛ తెలిసిన వాళ్ళకి త్యాగంగాని, తక్కినవాళ్ళకి త్యాగమేమిటి? సీత ప్రేమా, పాతివ్రత్యమూ, అన్నీ యెందుకూ పనికిరావు. యెందుకూ

రాముడికి? "ఇది పాదాసి, నా బానిస. నేనుతప్ప దీనికి గతిలేద"ని తెలుసు. అందుకనే అట్లా అన్నాడు. కానైతేని సీత నిప్పుల్లో వురికింది. రాముడు తనమీద అనుమాన పడుతో తిడుతోవుంటే కూడా, "నన్ను వొదలకు" అని ఏడ్చేదాన్నిచూస్తే యెవరికి రోతపుట్టదు?

సుంద: పెళ్ళి అయినప్పటినించి, అమ్మ నాన్నకోసం త్యాగంచేస్తోంది. నాన్నకి ఆరోగ్యంగావున్నా, తనకి జబ్బుగా వున్నా, అన్ని వుపచారాలూ చేస్తుంది. నాన్న నడగండీ మీ భార్య మీకేం త్యాగం చేసిందని? ఆయనికి తెలీకున్నా తెలీదు. ఒక్కటి తక్కువయితే విరుచుకు మీద పడతారు మళ్ళీ.

రామ: యింకోళ్ళు మెచ్చుకోవాలా? త్యాగం చెయ్యడమే సంతుష్టి!

సుంద: త్యాగంచేస్తే యెవరికన్నా వుపయోగముండాలి. పైగా నాన్న అన్ని సౌఖ్యాలూ వృథాగా పసుతో బండ బారుతున్నారు. ఆయన కొక్కపని చాతకాదు. రేపణ్ణించి అమ్మ లేకపోతే, మళ్ళీ ఆచాకిరికీ యింకో పెళ్ళాముంటేనే గాని బతకలేడాయన.

రామ: భర్తమీది భక్తి, ప్రేమా, అట్లా చెయ్యాలనిపిస్తాయి స్త్రీకి. యింకోళ్ళ కుపయోగముండాలనా?

నారా: కావలసి యెందుకండీ కల్లుమూసుకు మాట్లాడుతారు? యీ ఆడవాళ్ళందరికీ భర్తలమీద ప్రేమా భక్తీ వున్నాయని, మీరు విశ్వసిస్తున్నారా? నిజం చెప్పండి.

రామ: అసలు ఆదర్శము ప్రేమకదండీ?

నారా: సరే. ఆ అదృష్టమున్నవాళ్ళని ఆ సేవ చెయ్య మనండి. ప్రేమకే పెళ్లెందుకు? రోజూ పంచకరిగితే తంతాడో అని వెనక తిట్టుకునే పెళ్లి చెయ్యకుండా నే వుండకూడదూ? యీ ద్వంద జీవిత మెందుకు?

సుంద: చిన్నాన్నా! మామయ్యతో వాద మేమిటి? వూరుకో.

నారా: మీరు రేపో సంస్కరణంచేసి స్త్రీ నుద్ధరిస్తామనుకుంటున్నారు. మీ రివాజు పెళ్ళిళ్ళు, పూర్వం పెళ్ళిళ్ళకంటే ఏమీ భేదంకావు. స్త్రీ దిక్కులేక, చాతగాక ధైర్యంలేక మొగాడిమీద ఆధారపడ్డవాళ్లు యింతే. కూలి చేసుకుని తన పొట్టపోసుకునే ఆడది, యీ నాగరికుల కంటే, గ్రాడ్యుయేట్లయి మొగుళ్ళని వెతుక్కునే స్త్రీలకంటే, చాల నయం. పెళ్ళిలేకపోతే ఆడదానికి గతిలేదన్నవాళ్లు యేం చేసినా వొకటే! పదేళ్లకుచేసేది, పదహారేళ్లకు పెళ్లిచేస్తే యేం లాభం? అప్పుడయినా, యెవర్నో వొకర్ని పట్టితేవాలి. లేకపోతే, యింగ్లాండులోమల్లే, ఆమె యే తంటాల్లోపడి తెచ్చుకోవాలి. పెళ్లికాకపోతే, మొగాణ్ణి అద్దుపెట్టుకోకపోతే, ఆడదానికి జరగాలి, అప్పుడు స్త్రీజాతి బాగుపడాలి. యీ పెళ్లిళ్ల తొందరంతా యెంతనీచమో మీకు తెలీటంలా! పిల్ల పెద్దదవుతుందనికొందరూ, పిల్ల చెడిపోతుందనికొందరూ!

సుంద: వెళ్ళి 'టీ' తెద్దూ, పాపం, ఆయన్ని యింక వొదిలి.

[నారాయణరావు వెడుతున్నాడు.]

రామ: నిన్ను చూస్తే నాకు భయమేస్తోంది. ఆఖరికి యేమవుతావో అని; పెద్దవాణ్ణి చెపుతున్నా. యేమనుకోకు.

యిప్పుడు తెలీవు నీకు కష్టాలు.

[నారాయణరావు 'టీ' తీసుకొచ్చాడు. తాగుతున్నారు]

( తెర పడ్డది )

## మూడో రంగం

[సుందరం గదిపక్కన వున్న తోటలో నారాయణరావు, రామమూర్తీ, వొకరికొకరు యెదురుగా నుంచుని మాట్లాడుతున్నారు.]

రామ: యిన్నాళ్లమట్టి యింత కులాసాగా, ప్రేమగా, వుండి యిప్పుడిదేమి టిట్లా......

నారా: నా స్వభావమే ప్రేమ స్వభావము. కాని యిన్నాళ్ళూ మా యిద్దరికీ నిజమైన ప్రేమ లేనేలేదు. మొత్తానికి నాకు లేదు.

రామ: అయితే, యెందుకు పెళ్ళిచేసుకున్నారు?

నారా: నేను చేసుకోలేదు. ప్రేమ నేనేమెరుగుదును? నాకు చేశారు.

రామ: మరియిన్నాళ్ళు కలసి కాపరం యెందుకు చేశారు? మొదటే వొదిలెయ్యకపోయినారూ?

నారా: నాకు యిన్నాళ్ళూ మీా చెల్లెలిమీాద ప్రేమ వుందనే అనుకున్నా. యిప్పుడు లేదని తెలిసింది.

రామ: మీాకు ప్రేమలేదని తోచగానే వొదిలెయ్యడమేనా?

నారా: మరి యింకేం చెయ్యను?

రామ: ప్రేమ లేకపోతే నేం, కాపరం చెడగొట్టు

కుంటారా? దాని గతి యేమవుతుంది?

నారా: ప్రేమ లేకుండా స్త్రీని మట్టుకోడం, పరమ ఘోర హత్యము. ఆమె గతి గేమీకాదు. హాయిగా వుంటుంది. ఆమెకి కావలసినంత డబ్బుంది.

రామ: డబ్బా యింతకీ కావలసింది? సంసారం, పిల్లలూ. భర్తా లేకపోతే ఆడదాని కిం కేముంది?

నారా: సంసారం, పిల్లలూ లేకండా, బలవంతంగా యెంతమంది వితంతువులని వుంచుతున్నారో, జనాభా లెక్క చూడండి.

రామ: అది తప్పనేగా యిప్పుడు! అయినా, యిదీ అదీ వొకటే?

నారా: ప్రేమ పోయిం తరవాత, నేను బతికి, చచ్చి ఆమెకి వొకటే! నే నా సంసారం, పిల్లలూ, యివ్వలేను. ఆమె కొత్త సంసారం తెచ్చుకుంటే నా అభ్యంతరం లేదు.

రామ: బాగావుంది? అయిదేళ్లు కాపురంచేసి, యిప్పుడు కొత్త సంసారం యెక్కడ తెచ్చుకుంటుంది? గేం మాటు లండీ? లోకంలో అందరికీ వుత్కృష్టమైన ప్రేమే వుందా? వాళ్ళందరూ, భార్యల్ని లేచిపొమ్మంటున్నారా?

నారా: ఆమెని నేను వెళ్ళిపొమ్మన్లేదు. సంగతంతా చెపితే ఆమే వెడతానంది. ఆమె అట్లా అనడం నాకు చాలా న్యాయంగా తోచింది.

రామ: యేమిటీ? అదే వెడతానందా? నా చెల్లెలు, అట్లా అందా? నా చెల్లెలు!

నారా: సగౌరవం గల యే స్త్రీ అయినా ఆ మాటే అంటుంది.

రామ: మంచి మానమే! యేదీ నేనే అడుగుతాను.

[గుమ్మం దగ్గరికెళ్ళి, "సీతా" అని పిలిచాడు. సీత వొచ్చింది. ఆమెకి యిరవై యేళ్లు. సన్నగా, చామం చాయగా వుంది. అందమయిన మొహం.]

రామ: సీతా, నీ భర్తతో కాపరం చెయ్యకండా, వెళ్ళి పోతానని, నీ అంతట నువ్వే అన్నావా?

[సీత అవునని తలవూచింది.]

రామ: నీ అంతట నువ్వే! ఈయన నిన్ను వెళ్ళడానికి వొప్పుకునేట్టు యిబ్బంది చెయ్యాలా?

సీత: లేదు. యిప్పుడు నేను వుంటానన్నా, వీరి కేమీ అభ్యంతరం లేదు.

రామ: అయ్యో! అయ్యో! యిదేం బుద్ధే నీకు? చిన్నప్పట్నించి, స్త్రీ నీతి, ధర్మాలూ, పురాణాలూ, పతి వ్రతల కథలూ, చెప్పి పెంచితే, చివరికి పెనిమిటిదగ్గిర్నించి లేచిపోతానంటావా? యెందుకో చెప్పు పోనీ.

సీత: వున్న కారణాలున్నాయి. తప్పు నాది కాదు. ఆయ నదిలాగూ లేదు. నా గీత—

రామ: అయినా వొక కారణం చెప్పు...

సీత: ముఖ్యం ఆయనకి నామీద వుండవలసినమోస్తరు మోహం లేదు.

రామ: లేకపోతేమాత్రం వొచ్చేస్తావా? నిన్నేం బాధ పెట్టలా?

సీత: నేమీ పెట్టలేదు. కాని నేనిక్కడెందుకు? ఇంక యెక్కడుంటే నేం?

రామ: పోనీ, యిక్కడుంటే నేం?

సీత: నా ఆత్మగౌరవం వొప్పదు. అయినా యెందుకిక్కడ వుండాలి?

రామ: లోకం మర్యాద.

సీత: లోకాన్ని మోసపుచ్చనా? మర్యాదకోసం. నాకూ నా భర్తకీ యిష్టంవున్నట్టే కపటనాడకమాడనా?

రామ: రాముడు యిష్టంలేదంటే, సీత వెళ్లిపోయిందా?

సీత: వొద్దన్నవాళ్ల కాళ్లు పట్టుకునేటంత నీచురాల్ని కాదు.

రామ: నీ ప్రవర్తనచాత భర్తప్రేమ సంపాదించుకోవాలి.

సీత: ప్రేమపోవడానికి నేనేం చెయ్యలేదు, మొదటి నుంచీ ఆయనకే లేదుట.

రామ: మొదటినించీ లేకపోవడమేమిటి? పిచ్చిమాటలు? మాఅందరికీ కళ్లులేవూ? నాలుగుయేళ్లల్లో పోయినప్రేమ, నాలుగు నెల్లల్లో మళ్లీ రావొచ్చు.

సీత: వొస్తే అప్పుడు చూసుకుంటాంలే. అప్పుడేం చెయ్యాలో మే మాలోచించుకోలేమూ, అంతమాత్రం? నువ్వు చెప్పాలా?

(సుందరం వొచ్చింది)

రామ: చూశావుటమ్మా, యీ వ్యవహారం. నువ్వన్నా కొంచెం చెప్పకపోయినావా? భర్తని వొదిలి నువ్వు పడుతున్న కష్టం చాలదూ?

సీత: నాకేమీ కష్టం లేదే? చాలా సంతోషంగా, వృత్త మంగా బతుకుతున్నాను. మొగుళ్ళకి దాసీత్వం చేయడం మానుకుంటే గతిలేనివాళ్లు వెక్కిరించడం తప్ప, ఇంకేమీ ఇబ్బందిలేదని నాకు తెలుసు.

రామ: నీ సంగతి వేరు. నీ భర్త అట్లాంటివాడయ్యేను! ఆయనకేం ?

సుంద: ఈయనా అంతే. చెప్పలా ఆయన కిష్టంలేదని ?

రామ: లేకపోవడ మేమిటి? భార్య అయిన తరవాత తెచ్చుకోవాలి.

సుంద: మీరు ప్రేమ నెరుగుదురా? తెలిస్తే, అట్లా తెచ్చుకోవా లనరు. పెళ్లయితే, ప్రేమ అదే వొస్తుందనే వాళ్లందరికీ, ప్రేమంటే అసలు తెలీదు. ఆ పశుకామమే ప్రేమనుకుంటారు. కాకరకాయమీద మీ కిష్టంలేనిదే తెచ్చుకోండి ?

రామ: అదేం చేసిందని ప్రేమపోవడం ?

సుంద: ఆమె గోరం చెయ్యలేదు. ఆమెని చూస్తే మా యిద్దరికీ కూడా చాలాగౌరవం. కాకరకాయ యేంచేసిందని మీకిష్టం లేకపోవడం ?

రామ: ఐతే మధ్య యిప్పుడెందుకు అక్కర్లేకపోయింది?

సుంద: ఆయనకి నామీద అమితమైన ప్రేమ వొచ్చింది.

రామ: ఇప్పుడు కొత్తేం; చిన్నప్పణ్ణించి వుంది. అయితే మాత్రం, భార్యమీద యిష్టంయెందుకు పోతుంది? పిల్లల మీద ప్రేమవుంటే తండ్రికి భార్యమీదమాత్రం వుండదూ?

సుంద: అట్లాకాదు. ఆమెమీద వుండాలి అంటున్నారే.

అట్లాంటిమోసం పుట్టింది ఆయనకి నా మీద.

రామ: ఏమిటి? ఏమిటి? నీ మీద...నీమీద...

[రెండునిమిషాలు అట్లానే నుంచున్నాడు.] నిజమే? నిజమే? వేళాకోళం చేస్తున్నావు నన్ను.

సుంద: ఆమె నడగండి. అందుకనే ఆమె వెళ్ళిపోతానంది. చిన్నాన్న ఆమెతో చెప్పాడు.

రామ: ఐతే ఇట్లా చెప్పకుంటారా? సిగ్గుపడి దాచుకోవాలి గాని?

సుంద: సిగ్గుపడవలసిన విషయమేమీ కాదు. ప్రేమ రావడం సిగ్గేమిటి? ప్రేమరాని మూర్ఖులందరూ సిగ్గుపడాలి జంతువులమని.

రామ: అందరూ యేమంటారు?

నారా: మేమెవరినీ మోసపెట్ట తలుచుకోలేదు. మీకు తెలీకపోతే, సీతమీద మీకు కోపంపోదని మీకు చెప్పాము.

రామ: అదేమిటి? కూతురుమీద...

నారా: (తమ్ముడికి అక్క పిల్లనిస్తోందా లేదా, అట్లానే తమ్ముడికి అన్న ఇస్తేనేం?)

రామ: కూతురు...

నారా: కోడలు...

రామ: కోడలు పరవాలేదు.

నారా: కూతురూ పరవాలేదు.

రామ: పెద్దలట్లా శాసించారు.

నారా: పిన్నలిట్లా శాసించారు.

రామ: గోత్రమొకటవుతుంది, రక్త సంబంధం...

సుంద: రక్తసంబంధం అంటావా కేం. అడదాని గోత్రం మొగాడి కెందుకు రాకూడదసు?

రామ: అది ఆచారం...

నారా: ఆచారాలు మనమేగా యేర్పరిచేది? ఇట్లా నలుగురం, చేస్తే, యిదే ఆచారమౌతుంది. రైళ్ళల్లో భోజనం చెయ్యడం ఆచారం కాలా యిప్పుడు...? విధవావివాహాలు మీరాచారం చెయ్యడంలా? ఇదీ అంతే...

రామ: పెళ్ళే చేసుకోరాదూ?

నారా: యేమాత్రం అభ్యంతరం లేదు. నీతివేత్తలు, ఆచార్యులు, ఎట్లాగన్నా వుండమంటారుగాని పెళ్లి మాత్రం చేసుకోనీరుగా!

సుంద: ఐనా, నాకు పెళ్లియిష్టంలేదు. ఆయనకి నామీద వున్నట్లు నా కాయనమీద లేదు.

రామ: అమ్మా! పోనీ ఐతే యీగోలంతా యెందుకు?

సుంద: గోలేంలేదు. యెప్పటివలెనే వున్నాం.

రామ: ఐతే సీత యెందుకు వెడతానంటుందీ? మీరేం చేశారో? నీతీ, మతం, లేని తరవాత...

నారా: నీతీ, మతం వున్నవాళ్లమల్లే దొంగతనం మాకే మక్కర్లేదు. అవి పోయినాయని అంటారని భయం మాకేమీలేదు. కాని, ఆమెకికూడా నా మీద ఇష్టంలేనిది, నన్ను మీదచెయ్యి వెయ్యనియ్యదు. ఆమె ప్రతివ్రతకాదు, అసహ్యంగా వున్నా మొగుడన్నవాడికి దేహం వొప్పచెప్పడానికి.

రామ: (హేళనగా) యిష్టాని కేముంది? వొప్పిందను

కుంటే వొచ్చేస్తుంది. సీతమీద పోట్లుంజనుకుంటే, ఆతనికి ఒక్కరోజులో ఏలా?

నారా: అది మీ పతివ్రతలకి. ఒక్కరాత్రిలో యెంత కొత్తవాడిమీదైనా మోహంరావడం...

రామ: అయితే మీయిష్టమే మీదా, యింక లోకానికీ తక్కినవాళ్ళకీ తటస్థించే యిబ్బంది ఆలోచించారా ?

నారా: యేమాత్రం ఆలోచించం. అందరూ అట్లా ఆలోచిస్తున్నారా? యెవరికీ కష్టం కలగకండా చెయ్యగలిగే పని వొక్కటుందా లోకంలో ?

రామ: లోకంలో అందరూ యిట్లా మధ్య మధ్య యిష్టం లేదని పెళ్ళాల్ని వొదిలేస్తే......

నారా: చాలామంచిది, దేశం బాగుపడుతుంది. స్త్రీకి యీ బానిసత్వం వొదిలి, కొంచెం ఆత్మ గౌరవమున్నా వొస్తుంది.

రామ: మనశరీర వాంఛలూ, మనస్వార్ధమేనన్న మాట-

సుంద: మావి శరీర వాంఛలు కావు. గదుల్లో పెళ్లాల్ని మిఠాయిలాగు వాళ్ళ స్వంత వుపయోగార్థం దాచుకునే వాళ్ళవి శరీర వాంఛలు! యెక్కడ స్త్రీ అంతా తమ కేవుండదో అని, వొంటరిగా బయటికి రానీక, చదువుకోనీక, స్వంతంగా ఆలోచించుకోనీక. పాతివ్రత్యమనీ, స్త్రీ ధర్మమనీ, పేరుబెట్టి, వాళ్ళ ఆత్మలని చంపినవాళ్లది స్వార్థము. తమ సుకుమార హృదయాలకి, తమ సనాతన ధర్మ మేధస్సులకి, యేం నెప్పికలుగుతుందో, అది వాళ్ల దరిద్రపు ఆజ్ఞలకి,

కారణంలేని, నిరంకుశపు ఆచారాలకి లోబడి, యెంతటి ప్రేమనన్నా చంపుకోమనడం స్వార్థం కాదూ?

రామ: సంఘపు కట్టుబాట్లవి.

నారా: ఆ కట్టుబాట్లు పోతాయి అనే కదూ, దొంగతనంగా సాగనిస్తారు, ప్రేమసంబంధాల్నీ శరీరసంబంధాల్నీ? నేను గుడ్డివాణ్ణి కాను, ఘోరం, యిక్కడ కూతురంటున్నారు యింకా యింతకంటే, మీ సనాతన హృదయాలు అదిరిపడే పనులన్నీ రహస్యంగా కలుగుతోనే వున్నాయి. వాటి అన్నిటినీ సంఘం భరించగాలేనిది... యేమీ లేనిది, నాకీమెమీద మోహమన్నమాట, బాంబుమల్లె పేలింది కదూ మీ సనాతన ధర్మసంఘం బుర్రమీద...

రామ: దానికి మే మేం చెయ్యం! యెవ్వరు పోట్లాడినా ధర్మం నిలబెట్టాలనేగా!

నారా: నాకు తెలీదూ ఆ ధర్మం? మొగవాడి ధర్మం? వేలకొద్దీ వితంతువులని, స్త్రీ జీవచ్ఛవాలని, మూర్ఖపు తల్లుల్ని, నిరంకుశపు భర్తల్ని, లక్షలకొలది శిశుహత్యల్ని, అంతంలేని దొంగతనం, అబద్ధం, కపటాల్నీ కల్పిస్తున్న ధర్మాన్ని నే నెరగనూ?

రామ: యెందుకీ గల్లంతు? యెవరికీ తెలీకండా యింతటితో వూరుకోండి. బతిమాలుకుంటా.

సీత: నేను వెడుతున్నా.

రామ: నీతోనే ముఖ్యం మాట్లాడాలి. వుండు.

సీత: నువ్వురా, యిట్లా. (యిద్దరూ వెడుతున్నారు)

[సుందరం, నారాయణమూర్తీ, నవ్వుతున్నారు]

నారా: ప్రొద్దున్న అన్నయ్యతో అయింది. యిప్పుడు మీయనతో.

సుంద: యీయన అనేది, యేమన్నా చెయ్యండి, జైటికి మాత్రం రానివొద్దంటాను.

నారా: అన్నయ్య మళ్లీ కనపడ్డాడా ?

సుంద: లేదు.

నారా: అయితే మనం వెళ్లవలసిందే, యింట్లోంచి ?

సుంద: ఆ.

నారా: పోనీ, నేను వెడతా, నువ్వుండు. నేనేం తప్పు చేసింది ?

సుంద: నాకుకూడా నీమీద అట్లాంటి యిష్టముండి, వీళ్లందరి మధ్యా కలిసివుండి, పిల్లల్ని కని, దేవుడి ఆగ్రహం మనమీద యేమాత్రం రాదని, యీ ఆచారంగాళ్లకు చూపించాలని వుంది.

నారా: అంత అదృష్టం లేదుగా ?

సుంద: అవును, లేదు.

( తెర పడింది)



Paper Permit No. M. 305/43—1-6-45

